ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]

శుక్రవారం : 10–10–'80
రౌద్రినామ సం. ఆశ్వయుజ శు. పాడ్యమి
సంపుటము 74 సంచిక 4

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

పోస్టులో ఏడాది చందా రు. 54–60
ఆరు మాసాల చందా రు. 27–30
విడి ప్రతి వెల ఒక రూపాయి
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
'మహా పురుషుడు'లో
ఎన్. టి. రామారావు, జయసుధ

# జీవితములో చిన్న సరదాలకి యెట్లా పొదుపు చేయాలి



మీ బిడ్డ కళ్ళలో వెలుగు, మీ కుటుంబము ఎంతో కాలము నుండి అనుకుంటున్న విలాస యాత్రలు మొదలగు చిన్న సంతోషములు మీ జీవితానికి ఒక అర్థమును యిస్తాయి. వాటికోసము మీరు వయస్సులో వున్నప్పుడె కెనరా బ్యాంక్‌నందు **నిరంతర డిపాజిట్‌లో** పొదుపు చేయుటకు ప్రారంభించండి. ఎంత చిన్న మొత్తమునయినా ప్రతినెల సరిగాగాని, లేక పెద్ద మొత్తము ఒక్కసారిగాగాని పొందుపరిచిన భవిష్య జీవితమునకు అదనపు ఆదాయము. త్వరలోనే ప్రతి సంవత్సరము కెనరా బ్యాంకు మీకు సొమ్మును నిరంతరము తిరిగి నెలవారిగా చెల్లించును.

అధిక సుఖ సంతోషములకు, ఉద్యోగ విరమణ అనంతరము సుఖ జీవితమునకు డబ్బు తరగని ఆధారము. పైగా మీరు పొదుపు పరిచిన మొత్తము మీరు కోరినప్పుడు మీకు యివ్వబడును. జీవితములో అధిక సుఖములను కోరు యువజనుల కొరకే దూరదృష్టితో కెనరా బ్యాంకు వారు **నిరంతర డిపాజిట్లును** యేర్పరిచిరి.

మీకు దగ్గిరలో వున్న కెనరా బ్యాంకు శాఖకు వెళ్ళి వివరములను తెలుసుకొనండి

మా ప్రత్యేక ప్రణాళికలు
**కామధేను, విద్యానిధి, కాలక్షేమ**

## నిరంతర డిపాజిట్

## కెనరా బ్యాంక్




(జాతీయ బ్యాంక్)
1200 పైగా శాఖలు
దేశమంతటా కలవు.

maa CB 2 B Tel 80







నడిసముద్రంలో చుక్కాని లేని నావ




అనిశ్చిత సముద్రం

# ఉత్తరాలు

## ముఖచిత్రం

"వో బొజ్జ గణపయ్య" ముఖ చిత్రంతో వెలవడిన వినాయకచవితి సంచిక ఏంతో ప్రత్యేకతను సంతరించుకుని మా ముందు వాలింది. పాఠకులు కోరుకున్నదానికన్నా ఈ సంచిక మరింత ఉన్నతంగాఉందనడంలోసందేహంలేదు. "గణపతిఎవరు?" మారుతిగారి వ్యాసం చదివాను ఎంతో ఆసక్తి దాయకంగాఉంది. ఈవారం అందించిన కథలలో "మేం వేసి చూడు" పెద్ద కథ చదివాను ఎంతోబాగుంది నాంకెతో తృప్తిని కల్గించింది. "ప్రేమతీర్థం" సీరియల్ఆదిలో నన్ను ఎంతోఆకర్షించింది. ఇంక మిగతా భాగాలు ఇంతకన్నా మిన్నగా ఆకర్షించగలవు అనడంలో సందేహం లేదు. ఈ వారం కార్టూన్స్ చదివి కడుపుబ్బ నవ్వుకున్నాను.

కందిగట్ల ప్రభాకర్ (జనగాము)

* * *

సుజాత, కృష్ణంరాజుల ముఖ చిత్రంతో వెలవడిన వారపత్రిక చాలావాలా బాగుంది. ఈ వారం పత్రికలో కథలేవీ బాగాలేవు. 'జీవితగమ్యం' సీరియల్ అయిపోవడం నిరుత్సాహాన్ని కలిగించింది మంచి సీరియల్ వేయండి 'మువ్వల మురళి' సీరియల్ ఆసక్తికరంగా ఉంది.

జ్యోతి ఇమ్మానుయేలు, లతాప్రసాద్
(కొయ్యూరు)

## సీరియల్

సీరియల్ 'మువ్వల మురళి' బలా నచ్చింది. రచయిత్రి కుమారి ఆర్. సంధ్యాదేవిగార్కి మా అభినందనలు. 'జీవిత గమ్యం' సీరియల్ మరీ అంతగా నచ్చలేదు. ఇకపోతే కథలన్నీ బాగుంటున్నాయి. మీ సెలెక్షన్ బాగుంది. రామలక్ష్మిగారి జవాబులు ఘాటుగానాటుకుంటున్నాయి. బొమ్మలను ఎక్కువగా వేస్తే బాగుండును.

ఎ. రజనీశకుంతల (వైజాగ్)

## కథలు

"ఎవరికి వారే" "కొత్త చీర" కథలు రెండూ నాకు నచ్చినవి.

ఇకపోతే సీరియల్ "జీవిత గమ్యం" ముగింపు ఫర్వాలేదనిపించింది. రచయిత్రికి, ప్రచురించిన మీకు నా ధన్యవాదములు.

నందిగామ మణిమోహన్‌కృష్ణ (హైదరాబాద్)

* * *

29.8.80 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "ఇదేంబుద్ధి", "ప్రేమలేఖ" కథలు బాగున్నాయి. స్త్రీ మానభంగం పట్ల వేసిన గీతాగారి కార్టూన్లు నాకు నచ్చాయి.

సిందం గండయ్య జవహర్‌నగర్

సీరియల్

# ముళ్ళ మురళి

ఆర్. సంధ్యాదేవి

(గత సంచిక తరువాయి)

కృష్ణసుమంత్ ఒంటిగంట అవుతుండగా, మెల్లగా చప్పుడు కాకుండా లోపలకు వచ్చి మంచం మీద పడుకున్నాడు. అప్పుడే హరిత పొడిదగ్గు దగ్గింది, తను మెలకువగానే వున్నట్టు భర్తకు తెలియచేస్తూ.

భార్య దగ్గటం వినగానే అతను గతుక్కుమన్నట్టు అయ్యాడు. లేచి, లైటు వేసుకుని గాజు కూజాలో నీళ్ళు గ్లాసులోకి ఒంపుకుని త్రాగింది హరిత.

కృష్ణసుమంత్ అప్రయత్నంగా భార్య వైపు చూశాడు. ఇద్దరి కళ్ళూ క్షణం కలుసుకున్నాయి. ప్రపంచంలో వున్న ఏవగింపు అంతా ఆమె కళ్ళల్లో ప్రతిబింబించ సాగింది. కళ్ళు కత్తుల్లా వున్నాయి. ఆమె చూపులు అతని గుండెలని చీల్చేస్తున్నట్టుగా వున్నాయి. ఆ చూపులకి ఇక తట్టుకునే శక్తి లేనట్టు,ఆమె చూపులతో తన చూపులు ముడిపడకుండా అటు తిరిగి పడుకున్నాడు. హరిత మౌనంగా లైటు ఆర్పి పడుకుంది. భర్తతోఒక్క మాట మాట్లాడలేదు.

## 37

రోజా తన గదిలో మంచంమీద పడుకుని తీయని ఊహల్లో తేలిపోసాగింది. ఇక తన కలలు ఫలించినట్టే! కొద్ది రోజుల్లో రిజిష్టర్ మ్యారేజ్ జరిగిపోతుంది. రిజిష్టర్ మ్యారేజ్ చేసుకోవడానికి గాను అన్ని ఏర్పాట్లు జరిగిపోతున్నాయి. ఎవ్వరికి తెలియకుండా గప్ చిప్‌గా చేయించేస్తున్నాడు కృష్ణసుమంత్.

ఆయన కళ్ళల్లోకి చూస్తుంటే తనని తనే మరచిపోతూంది. ఆయన మాటలు వింటుంటే చెవుల్లో అమృతం పోసినట్టుగా వుంటుంది. 'ఆయన లేకపోతే తను క్షణం బ్రతకలేను' అనుకుంది. భగవంతుడు దయామయుడు. కోరుకున్న వ్యక్తినే భర్తగా ప్రసాదిస్తున్నాడు. మనసులో ఆరాధించిన వ్యక్తికే ఇల్లాలు అవుతూంది. తను నిజంగా అదృష్టవంతురాలే!

అందం, చదువు, ఐశ్వర్యం, గుణం అన్నీ వున్న భర్త లభించటం అంటే మాటలా!

కృష్ణసుమంత్ మాటలు మొదట తనకి నమ్మకం కలిగేదికాదు. రానురాను నమ్మకం కుదిరింది. అతని మాటలు నమ్మి తన జీవితాన్నే అతని చేతుల్లో వుంచింది. తనకు ఇచ్చిన మాట నిజం చేస్తున్నాడు.

రిజిష్టర్ మ్యారేజ్ అయిపోతే ఇక తన కలలు ఫలించినట్టే! కృష్ణసుమంత్ తల్లిదండ్రులు 'అలాగే'నని కొడుకు దగ్గర అంటే, తన మెడలో మూడుముళ్ళూ పడిపోతాయి. అంతవరకూ తను ఎక్కడా రిజిష్టర్ మ్యారేజ్ గురించి అనకుండా కాస్త ఓపిక పడితే, ఇక దర్జాగా తల ఎగరేసుకుని నలుగురిలో తిరగవచ్చు. నలుగురూ తనని చూసి నవ్వి హేళన చేసిన వాళ్ళంతా, నోరు మూసుకుని కూర్చుంటారు. కృష్ణసుమంత్ ఎవరో, తనకేమి అవుతాడో ఈ ప్రపంచానికి అంతా చాటి చెప్పాలనిపిస్తూంది. అంతా ఈర్ష్యతో మగ్గిపోవాలి. తన అదృష్టంచూసి అంతా కుత కుత మండిపోవాలి. అప్పుడుగాని తన మనసు శాంతించదు.

కృష్ణసుమంత్ తనని హోటల్ రూమ్‌కి తీసుకువెళ్లటం గుర్తు వచ్చింది. అప్రయత్నంగా రోజా చెంపలు ఎర్రగా కందిపోయాయి సిగ్గుతో. కళ్ళుమూసుకుని గుండెలమీద వున్న పుస్తకం ముఖానికి అడ్డుగా పెట్టుకుని తనలో తాను నవ్వుకుంది.

"ఛ, ఛ. ఆయనివి అన్నీ కొంటెచూపులు

**జరిగిన కథ—11:** పి. యు. సి. పాసయిన మల్లిఖార్జునరావు చెల్లెలు హరితకు, తెచ్చిన ఏ సంబంధమూ నచ్చటంలేదు. తన పెద్ద మామయ్య శంకరంగారి కూతురు శీల పెళ్ళికి మద్రాస్ వెళ్తుండగా ఆమెకు ట్రైన్‌లో 'కృష్ణసుమంత్'తో పరిచయమేర్పడుతుంది. అతని అందాన్ని మనసులో మెచ్చుకొంటుంది. మళ్ళీ అతను శీల పెళ్ళిలో కనబడ్డప్పుడు ఆమె కలవరపడుతుంది. మామయ్య కొడుకయిన కుమార్ భార్య శైలజ కోరగా ఆమెతో బలభద్రరావుగారింటికి వెళ్తుంది హరిత. విజయమ్మా, బలభద్రరావుగార్ల ఏకైక పుత్రుడే ఈ కృష్ణసుమంత్ అని తెలుసుకుంటుంది హరిత. విశాఖపట్నంలో లాయర్‌గా పనిచేస్తున్న కృష్ణసుమంత్‌కి రామనాథం మేష్టారు ద్వారా పరిచయమైన తండ్రిలేని రోజాను, ఆమె తల్లి సీతమ్మను సంరక్షిస్తుంటాడు. తన ఫ్రెండ్ తమ్ముడికి ఉద్యోగం వేయించమని అడగటానికి వస్తాడు మల్లిఖార్జునరావు. అతనికే విషయమూ మరునాడు చెబుతానని చెప్పి, వచ్చేటప్పుడు హరితను కూడా తీసుకురమ్మని వాళ్ళని డిన్నర్‌కి ఆహ్వానిస్తాడు కృష్ణసుమంత్. మల్లిఖార్జునరావు చాకచక్యంగా హరితను డిన్నర్‌కు తీసుకువెళ్తాడు. కృష్ణసుమంత్ ఫ్రెండ్ శాస్త్రి ద్వారా అతని తల్లిదండ్రుల అడ్రస్ కనుక్కొని, వెళ్ళి హరిత పెండ్లి విషయం మాట్లాడివస్తాడు మల్లిఖార్జునరావు. కృష్ణసుమంత్ తల్లిదండ్రులు వచ్చి, హరితతో అతని పెళ్ళి నిశ్చయం చేసి వెళ్తారు. కృష్ణసుమంత్, హరితల వివాహం అతివైభవంగా జరిగిపోతుంది. కొన్ని కారణాలవల్ల కృష్ణసుమంత్, హరితల మధ్య ఘర్షణలు మొదలౌతాయి. రోజా తల్లి చనిపోగా, ఆమె కర్మకాండలన్నీ కృష్ణసుమంతే జరిపిస్తాడు. రోజా కృష్ణసుమంత్‌ల మధ్య అక్రమ సంబంధం ఉన్నదని ఒకామె ద్వారా తెలుసుకొన్న హరిత, భర్తను నిలదీసి అడుగుతుంది. అతని నుండి ఏ సమాధానం రాకపోయేసరికి, తన అన్నగారు వాళ్ళు వూరినుండి రాగానే వాళ్ళదగ్గరకు వెళ్ళిపోవడానికి నిశ్చయించుకొంటుంది హరిత. ఈలోగా తను వుంటున్న వీధిలోని వాళ్ళంతా సూటిపోటి మాటలతో కాకుల్లా పొడుస్తుంటే భరించలేక కృష్ణసుమంత్ ఇంటికి వచ్చినరోజాను అతను తన గెస్ట్‌రూంలో వుంచుతాడు. హరిత ఇంటి విషయాలు పట్టించుకోకుండాముభావంగా ఉండటం చూసి కృష్ణసుమంత్, ఆ ఇంటి బాధ్యతలు అన్నీ రోజాకే అప్పగించేస్తాడు.



కొంటెమాటలు." రోజా అంతా గుర్తు తెచ్చుకుని మనసులోనే నవ్వుకుంది.

ఈసారి అలా కొంటెవేషాలు వెయ్యకుండా చెవి గట్టిగా మెలిపెడ్తే అప్పుడు తెలుస్తుంది అబ్బాయిగారికి. రోజా ఫక్కున నవ్వుకుంది.

మూడవనాడు సాయంత్రం కృష్ణసుమంత్ రోజాకి మెల్లగా చెప్పాడు, "రేపు వుదయం పది గంటలకి మనం బయలుదేరి రిజిస్ట్రా ఫీసుకి వెళ్ళాలి. నువ్వు రెడీగా వుండు" అంటున్న అతని కళ్ళు సంతోషాన్ని దాచుకో లేకపోతున్నాయి.

అతని మాటలు వినగానే రోజా చెంపలు గులాబి మొగ్గలు అయ్యాయి. సిగ్గుతో కను రెప్పలు పైకి ఎత్తలేక పోయింది.

"రోజా!" అతని గుండెల్లో అనురాగం నిండుగా పొంగి పొర్లుతూంది.

రోజా ఇక అక్కడ వుండకుండా గదిలోకి వెళ్ళిపోయింది.

మర్నాడు రోజా, కృష్ణసుమంత్ ఇద్దరు రిజిస్ట్రాఫీసుకువెళ్ళారు. అక్కడనుండి అతను కోర్టుకి వెళ్ళిపోయాడు. రోజా కారులో యింటికి వచ్చేసింది.

రోజా మనసు ఒక్కచోట నిలవటంలేదు. గాలిలో అలా అలా తేలిపోతూంది. ఆంతర్యం అంతా లేడిపిల్లగా చెంగు చెంగు మంటూ గంతులు వేస్తూంది.

రిజిష్టర్ మ్యారేజ్ అయిపోయింది!

ఆమె సంతోషం పట్టలేక పోతూంది! ఏ పనీ చెయ్యబుద్ధి పుట్టటం లేదు. మనసులో తియ్యని ఊహలు చోటు చేసుకున్నాయి.

సాయంత్రం కోర్టునుండివచ్చాక ఏవ్వరూ లేకుండా రోజాతో అన్నాడు—

"రిజిష్టర్ మ్యేరేజ్ అయిపోయింది. ఇక పీటలమీద పెళ్లి వుంది." అంటూ నవ్వాడు.

రోజా వదనం చిన్నబోయి నట్టు అయి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"రోజా!" ఆమె కళ్లల్లో నీళ్లు చూసి కంగారు పడ్డాడు.

ఆమె మాట్లాడలేదు, కళ్లనీళ్ళు ఆమె చెంపలని తడిపేశాయి.

"సంతోషించవలసిన సమయంలో కన్నీరా!" అంటూ ఆమె బుజాలు పట్టి దగ్గరకు తీసుకున్నాడు.

రోజా ఇక నిలబడలేనట్టు అతని గుండె లపై తల ఆన్చి, వెక్కి వెక్కి ఏడ్చేసింది.

"రోజా!" అంటూ ఆమె చుబుకంపట్టి పైకెత్తి, కళ్లల్లోకి చూస్తూ అడిగాడు—

"ఏం జరిగింది! ఎందుకు ఏడుస్తు న్నావు?"

"అమ్మ గుర్తుకు వచ్చింది. ఈ రోజునే గనుక అమ్మవుంటే ఎంత సంతోషించేదో!"

అతను మాట్లాడలేదు. కర్చీఫ్‌తో ఆమె కళ్ళు వత్తి, తల నిమిరి, గుండెలకు చేర్చు కున్నాడు.

మర్నాడు ఫోన్‌లో బలభద్రరావుగారు చెప్పారు కొడుకుతో—

"రేపు మీ అమ్మా, నేనూ బయిలుదేరి వస్తున్నాం వైజాగ్‌లో మన బంధువుల అబ్బాయి పెళ్లికి. మూడవనాడు మళ్లీ వెళ్లి పోవాలి. మద్రాసులో మళ్లీ మరో పెళ్లివుంది ఆ పెళ్లికి తప్పక వెళ్ళాలి. అందుకే మళ్లీ వెంటనే వెళ్లిపోవటం" అని.

కృష్ణసుమంత్‌కి తల్లిదండ్రులు వస్తు న్నారు అంటే మతిపోయినంత పనిఅయింది

రోజా సంగతి ఇంకా వాళ్ళకి చెప్పలేదు. ఈ పరిస్థితుల్లో వస్తే పెద్ద గొడవ అయిపోదూ!

రోజా యిక్కడ వుంటే హరిత తల్లి దండ్రులతో ఏమైనా చెప్పి గొడవ పెట్టించ వచ్చు. ఇలాటి గొడవలు ఏమీ లేకుండ మెల్లగా, సావకాశంగా నచ్చచెప్పాలని కదూ తను ఇన్నాళ్లూ ఓపిక పట్టింది.

కృష్ణసుమంత్ గదిలో పచార్లు చేస్తూ చురుగ్గా ఆలోచించసాగాడు. వెంటనే అతని మస్తిష్కంలో ఓ ఆలోచన మెరుపులా మెరిసింది. తలపంకించి ఒక నిర్ణయానికి వచ్చినట్టు తేలిగ్గా వూపిరి తీసుకున్నాడు.

మర్నాడు తల్లిదండ్రులు వచ్చే టైముకి రోజా యింటిదగ్గర లేకుండా, కారులో తీసుకువెళ్ళి హోటల్‌రూమ్‌లో వుంచి, తిరిగి యింటికి వచ్చేశాడు. హరితకు గట్టిగా చెప్పి

ఒక్కమాటా వాళ్ళకు చెప్పకుండా ఆమె నోరు మూయించి కూర్చోబెట్టాడు.

హారిత నిస్సహాయురాలిలా భర్త వైపు చూస్తూ వుండిపోయింది. అంత కంటే ఏం చెయ్యగలదు! అతని ఇల్లు అతని ఇష్టం! ఎలా పడి వుండమంటే అలా పడి వుండాలి. కొద్దిరోజుల భాగ్యానికి గొడవ పెట్టుకోవటం అనవసరం.

తన సుఖసంతోషాల్ని రోజా తన కాలి క్రిందవేసి, నిర్దాక్షిణ్యంగా ఏనాడో కాలరాచి పారేసింది. ఇప్పుడు గొంతుక చించుకుని, అరిచి గొడవచేస్తే మాత్రం తనకా భాగ్యం దక్కుతుందా! భర్త ఎప్పుడో పరాయి సొత్తు అయిపోయాడు.

హారిత అత్తా మామగార్లదగ్గర మౌనమే వహించింది. మునుపటిలా నవ్వుతూ, సరదాగా వుండడానికే ప్రయత్నించింది.

విజయమ్మ, బలభద్రరావుగారు కోడలి మనసులో దిగులుని వాళ్ళు గ్రహించలేక పోయారు.

తల్లి ఎదురుగా హారితా! హారితా! అంటూ ప్రతీ చిన్న విషయానికి పిలుస్తూ, ప్రతీ చిన్న విషయమూ ఆమెపై ఆధారపడి నట్టుగా మసల సాగాడు. హారిత భర్తకు తగినట్టుగానే చిరునవ్వుతో ఏం కావలిసినా అందిస్తూంది. ఆనిడకు వాళ్ళ కాపురం చూస్తుంటే సంతోషం పొంగిపోసాగింది.

"మరో రెండు రోజులుంటే వింత బాగుండేది, మళ్ళీ అక్కడ పెళ్ళికి వెళ్ళాలి. తప్పదు" అనుకుంది మనసులో.

"పోనీలే, ఈసారి వచ్చినప్పుడు ఒకనెల రోజులు వుంటాను" అనుకుంది.

బలభద్రరావుగారికీ మనసులో సంతోషం గానే వుంది.

## 38

పెళ్ళికి కృష్ణసుమంత్ దంపతులను కూడా పిలిచారు వాళ్ళు. ఆదివారం ఉదయం ఏనిమిదిన్నరకు పెళ్ళి. కారులో బలభద్రరావు గారు, కృష్ణసుమంత్, విజయమ్మ, హారిత అంతా కలిసి వెళ్ళారు.

హారితకు వాళ్ళతో కలిసి వెళ్ళటం ఇష్టం లేదు. 'భర్త వెంట సరదాగా వెళ్ళేరోజులు వెళ్ళిపోయాయి' అనుకుంది. అత్తగారి పట్టు దల వలన బయలుదేరక తప్పలేదు. అయిష్టంగా వాళ్ళతో బయలుదేరి వెళ్ళింది.

ఆ రాత్రి కృష్ణసుమంత్ ఫ్రెండ్స్ ముగ్గురిని డిన్నర్‌కి ఇంటికి పిలిచాడు. హారితను పిలిచి వచ్చిన వాళ్ళని ఒక్కొక్కళ్ళనే పరిచయం చేశాడు. వాళ్ళ ముగ్గుర్నీ ఒక్క—క్షణం పరీక్షగా చూసింది. వాళ్ళ ముగ్గురూ చదువూ, సంస్కారం వున్నవాళ్ళలాగే కనిపించారు. హారిత వాళ్ళ ముగ్గురికీ చిరునవ్వుతో నమస్కరించింది.

వాళ్ళల్లో వి.ఎస్. పట్నాయిక్‌కి నలభై అయిదు సంవత్సరాలు వుంటాయి. నల్లగా, కాస్త పొడుగ్గా వున్నాడు. మరొక అతను నార్త్ ఇండియన్ పరేక్. తెల్లగా, పొట్టిగా వున్నాడు. వయసు ఇంచుమించు కృష్ణసుమంత్ వయసే వుంటుంది. మూడవ అతను మన్‌మోహన్. చామనఛాయగా, కొద్ది పొడవుగా, పొడవుకి తగిన లావుతో అందంగా వున్నాడు. పరేక్, మన్‌మోహన్ ఇద్దరూ పూనా నుండి వచ్చారు. పట్నాయిక్ బొంబాయి నుండి వచ్చాడు.

### అరణ్యారోదనం

మానవుడికి యింకా
మాటాడ్డం రాకముందు
తన సుఖాన్ని, దుఃఖాన్ని
అవతలవాడికి అనర్గళంగా
చెప్పుకొనేవాడట
డప్పుమీద వాయించి!
మాటా మంతీ నేర్చిన
నేటి మనిషేం మరీ,
అక్షరాలా ఆక్రోశిస్తూనే
తోటివాడికి అర్థం కాకుండా
ఆటవికుడికన్నా ఘోరంగా
అఘోరిస్తున్నాడు?

—"సత్యశ్రీ"

అంతా డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నారు. పట్నాయిక్, పరేక్ చూపులు హారిత వైపే వున్నాయి ఆశ్చర్యంగా. మన్‌మోహన్ అయితే అసలు ఆమె పై నుండి చూపులు తిప్పటంలేదు, రెప్ప వాల్చకుండా ఆమె వైపే చూస్తున్నాడు.

హారిత ఆ సంగతి గ్రహించి కొద్దిగా కంగారు పడింది, 'ఈ సంగతి భర్త గ్రహించేస్తాడేమో' అని.

అప్రయత్నంగా అతని వైపు మళ్ళీ చూసింది. మన్‌మోహన్ చిరునవ్వుతో అలాగే చూస్తున్నాడు. హారితకు నిజంగా అతను అంటే చిరాకువేసింది. ఏంకావలసినా వంటవాడ్నే వెళ్ళి వడ్డించమంది. ఆమె అసలు డైనింగ్ హాలులోకి వెళ్ళలేదు.

అది గమనించిన కృష్ణసుమంత్ లేచి వెళ్ళాడు లోపలకు—

"ఏమిటి! వంటవాడ్ని వడ్డించమంటున్నావు, నువ్వు వచ్చి వడ్డించు" అన్నాడు.

"నేను రాను" మొండిగా చెప్పింది.

"నువ్వు రాకపోతే వాళ్ళు ఏమనుకుంటారు?"

"ఏమనుకుంటే నాకేం! వాళ్ళనుచూస్తే నాకు చిరాకు వేస్తూంది" అంది చిరాగ్గా నుదురు చిట్లిస్తూ.

కృష్ణసుమంత్ కనుబొమ్మలుఆశ్చర్యంతో పైకి లేచాయి, భార్య మాటలు వినటంతోనే.

"వాళ్ళా! ముగ్గురూ చాలా మంచివాళ్ళు. నాకు బాగా తెలుసు" నమ్మకంగా చెప్పాడు.

"మీకు అందరూ మంచివాళ్ళే" ముఖం తిప్పుకుంది.

"అయితే నువ్వు రావా?"

"రానని మీకు ఎన్నిసార్లు చెప్పాలి! మళ్ళీ అడిగేరు అంటే మీ సంగతి అత్తయ్యగారికీ, మావయ్యగారికి చెప్పేస్తాను" బెదిరిస్తున్నట్టుగా అంది.

అంతే! కృష్ణసుమంత్ మరి మాట్లాడ లేదు. అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

డిన్నర్ ముగిసి వాళ్ళు వెళ్ళేసరికి రాత్రి పదిన్నర దాటింది.

*  *  *

బలభద్రరావుగారు, విజయమ్మ ఆరోజు మెయిల్‌కి వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళిపోతుంటే హారితకు దుఃఖం ముంచుకు వచ్చింది. మళ్ళీ తన జీవితం మామూలే! మునుపటిలా గదిలో ఒంటరిగా కూర్చుని, రాత్రి పగలూ కుమిలిపోవలసిందే! వాళ్ళు వెళ్తుంటే అంతా వారితో చెప్పేయాలని నాలిక చివరవరకూ వచ్చాయి.మళ్ళీ అంతలోనే ఆ మాటలు పైకి రాకుండా గొంతుకలోనే బలవంతంగా మింగుకుంది.

చెప్తే వాళ్ళు మాత్రం ఏం చేస్తారు! నాలుగు కేకలు వేస్తారు. అంతే!

చిన్నబ్బాయా! నాలుగు దెబ్బలు వేసి భయం చెప్పడానికి. అందుకే హారిత

వారి ముందు మౌనం వహించింది. వాళ్ళు వెళ్ళిపోయారు.

కోర్టునుండి వస్తూనే కృష్ణసుమంత్, రోజాని తీసుకుని యింటికి వచ్చేడు. రోజా మామూలుగా ఎప్పటిలా యింట్లో చకచక తిరుగుతూ తన పని తను చూసుకుంటోంది.

హరిత ఎప్పటిలా మంచంమీద పడివుంది, ఇటూ కదలకుండా.

ఆ రాత్రి పదకొండు గంటలు అయింది. హరితకు మెలుకువ వచ్చి పక్కకు చూసింది. కృష్ణసుమంత్ మంచం మీద లేడు.

ఆమె లేచి లైటు వేసింది. అతను ఆ గదిలో లేడు. ఒళ్ళు మండిపోయి గది తలుపులు తీసుకుని, అవతలకు వెళ్ళింది. రోజా గది తలుపులు లోపల గడియవేసి వున్నాయి. అనుమానంగా ఆ గదితలుపుల వైపు చూసింది. భర్త ఆ గదిలో వున్నారా! లేరా! అని, ఎటూ నిర్ధారణ చేసుకోలేక సందిగ్ధంలో పడింది.

వెనుతిరిగి వచ్చేసింది. ఆఫీసు గదిలో లైటు హాలులోకి పడుతూంది. ప్రశ్నార్థకంగా కనుబొమ్మలు ముడిపడ్డాయి. మెల్లగా అటు వెళ్ళింది. కృష్ణసుమంత్ ఆఫీసు రూమ్‌లో కూర్చుని శ్రద్ధగా ఎటూ చూడకుండా, వ్రాసుకుంటున్నాడు.

అతను ఎప్పటి నుంచో వ్రాసుకుంటు వ్నట్టుగావుంది అతని వాలకం చూస్తూంటే! టేబుల్ మీద ఫైల్స్ అలా పడి వున్నాయి.

# మువ్వల మురళి

ఎందుకో ఒక్కసారిగా వ్రాయటం ఆపి, తల ఎత్తి చూశాడు. గుమ్మంలో హరిత నిలబడి వుంది.

"హరితా! ఏమిటి ఇలా వచ్చావు! ఏం కావాలి!" అనురాగంతో చూస్తూ మృదువుగా అడిగాడు.

"ఇలారా" చెయ్యి చాపాడు దగ్గరగా రమ్మన్నట్టు. అతని గుండెల్లో పొంగుతున్న ప్రేమ అతని కళ్ళల్లో ప్రతిబింబిస్తూంది. అతని పిలుపు మృదు మధురంగా వినిపించగానే అతని కళ్ళల్లోకి క్షణం చూసింది. కళ్ళతో ఆమెను దగ్గరకు రమ్మన్నట్టు పిలిచాడు చిరునవ్వుతో.

ఒక్క ఉదుటున వెళ్ళి అతన్ని హత్తుకుపోయి, గుండెల్లో తల దాచుకోవాలన్న కోరిక బలంగా అనిపించింది.

తననితాను అతికష్టం మీద నిగ్రహించుకుని, అలా నిలబడిన చోటే బొమ్మలా వుండిపోయింది. ఒక్క క్షణం ఆమె మనసు ఒక ఊగు ఊగింది.

ఆ కళ్ళల్లోకి పరీక్షగా చూసిన ఆమెకు అతని కళ్ళల్లో కల్మషం కనిపించలేదు. నిండుగా తనపై ప్రేమ పొంగుతూ కనిపించింది. స్వచ్ఛమైన చిరునవ్వు పెదవులపై కనిపించటంతో తను అతని విషయంలో పొరపడటంలేదుకదా! అనుకుంది ఆక్షణంలో.

అంతలో ఆమె అంతరాత్మ ఫక్కున నవ్వినట్టు అయింది.

"ఎంత అమాయకురాలివి! రోజాకీ, ఇతనికీ సంబంధం లేదా! వాళ్ళ నవ్వులూ, హాస్యాలూ, అర్ధరాత్రి గదిలోకి దూరి తలుపులు బిగించుకోవటం నీకు ఇంకా అర్థంకాలేదా!"

హరిత మరి ఆలోచించలేకపోయింది. గిరుక్కున వెనుతిరిగి వెళ్ళిపోయింది.

వెళ్తున్న భార్య వైపు క్షణం అలాగే చూసిన అతనికి, గుండెలలో నుండి బలమైన నిట్టూర్పు ఒకటి వెలువడింది.

## 39

రిజిష్టర్ మ్యారేజ్ అయిపోయిన దగ్గర నుండి రోజా మనసులో బెంగ, బాధ మాయం అయిపోయాయి. ఆ యిల్లు ఆమెకు పరాయి ఇల్లులా అనిపించటం లేదు. ఇల్లు అంతా స్వతంత్రంగా, నిర్భయంగా తిరగ్గలుగుతూంది. యింట్లో నౌకర్లు అంతా ఇప్పుడు రోజా ఎంత చెప్పితే అంత! హరిత అసలు గదివదిలి బయటకు రావటం లేదు. కాని హరిత అంటే నౌకర్లందరికీ గౌరవమే. మునుపటిలాగే చూస్తున్నారు. కాకపోతే ఆమె లోపలే వుండిపోతూంది. అంతే!

ఆరోజా కోర్టు నుండి వచ్చి, స్నానంచేసి, బట్టలు మార్చుకుని కూర్చునే సరికి సెక్రటరీ టైపు కొట్టిన కాగితాలు ఏవో తీసుకువచ్చాడు హాలులోకి. ఆరోజు వచ్చిన లెటర్స్ కొన్ని ఆయన ముందు వుంచాడు. ఆ లెటర్స్‌కి జవాబు ఏం వ్రాయాలో చెప్పాడు. ఆరోజు టైపు చేసిన కాగితాలు చూశాడు.

సెక్రటరీకి చెప్పవలసిన విషయాలు చెప్పి, అతన్ని పంపేశాడు. తరువాత క్లర్క్ వచ్చాడు, ఫైల్స్ పట్టుకుని. అతనితో మాట్లాడి పంపేసరికి క్లయింట్స్ ఒక్కొక్కళ్ళా రావటం మొదలు పెట్టారు. వాళ్ళతో మాట్లాడి, వాళ్ళను పంపేసరికి రాత్రి సరిగ్గా పదిగంటలు అయింది. కేసులు గురించి వచ్చేవాళ్ళు కాక, ఉద్యోగాలు గురించి, రికమండేషన్ల గురించి వచ్చేవాళ్ళూ వుంటారు.

హరిత ఆ రాత్రి భోజనం చెయ్యలేదు.

కృష్ణసుమంత్ భోజనానికి వచ్చేవరకూ రోజా అలాగే కూర్చుంది. అతను భోజనానికి వచ్చేవరకూ ఆమె ఎప్పుడూ భోజనం



# 21 లక్షల క్రొత్త వ్యక్తులు గత సంవత్సరం డెట్ బిళను వాడారు

# దీనికి ఒక ప్రబల కారణం వుంది- డెట్ యొక్క ఉజ్వలమైన ఉతుకు

ఇప్పుడు ముందుకంటే ఎంతో ఎక్కువ మంది డెట్ బిళ్ల యొక్క ఉజ్వలమైన ఉతుకును ఇష్టపడుతున్నారు, వారంటారు; ఇది మిరమిట్ల తెలుపును, ఎంతో ఎక్కువ పొదుపును ఇస్తుంది.

| ఉత్తమమైన డిటర్జెంట్ బిళ్ళల వృద్ధి | |
|---|---|
| | క్రొత్త గ్రాహకులు |
| డెట్ బిళ్ల | 21,00,000 |
| రెండవ ఉత్తమ బిళ్ల | 14,00,000 |
| మొత్తము 49,00,000 క్రొత్త గ్రాహకులు | |
| మూలం: రిటైల్ స్టోర్ ఆడిట్ రిపోర్ట్: జనవరి-డిసెంబర్, 1979<br>వాడకపు ఆధారం: 1 బిళ్ల, ప్రతి నెల, ప్రతి వ్యక్తి | |

21,00,000 క్రొత్త వ్యక్తులు డెట్ బిళ్లను వాడటం మొదలెట్టారు-

మరి మీరు ?




## డెట్ బిళ్ల

వాడండి
తెలుపును పొందండి

Shilpi-DM-14A/80 Tel

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. —సం.

వెయ్యడు. ఏంత ఆలశ్యం అయినా అలాగే కూర్చుంటుంది.

ఆ రోజు అతనికి అన్నం పడ్డిస్తూంది రోజా. హరిత మామూలుగా అటుగా వెళ్తూ డైనింగ్ హాలులోకి చూసింది. వాళ్లిద్దరూ హరితను చూడలేదు.

కృష్ణసుమంత్ రోజా వెనుతిరిగి వెళ్తుంటే, ఎడంచెయ్యి చాసి చటుక్కున ఆమె చెయ్యి అందుకున్నాడు.

"చెప్పు, నేను అడిగినదానికి సమాధానం చెప్పు."

"ఉహూ! నేను చెప్పను అంటే చెప్పను" అంటూ చెయ్యి విడిపించుకో బోయింది.

"చెప్పకపోతే నేను వూరుకుంటానా!" అతను నవ్వుతున్నాడు. రోజా కూడా నవ్వు దాచుకుంటూంది.

"చెప్పనా ?"

"ఊహూఁ!" అంటూ నవ్వింది.

హరిత మరి ఇక అక్కడ నిలవక పరుగున లోపలకు పారిపోయింది. దుఃఖం ఆగలేదు.

బాధని ఇంకా భరించే శక్తి ఆమెకు లేదు. మల్లిఖార్జునరావు వాళ్ళూ మరో నాలుగు రోజుల్లో వచ్చేస్తారు. అంతవరకూ ఇక ఆ ఇంట్లో వుండడానికి హరితకు మనసు అంగీకరించటం లేదు. ఆకాశం కూలిపోతు న్నట్టుగా వుంది. హరిత ఆపాదమస్తకం కంపించిపోతూ, పగిలిపోతున్న తలను రెండు చేతులతో గట్టిగా పట్టుకుంది. ఆమె అంతరాత్మ గట్టిగా నొక్కి చెప్పింది.

"అభిమానం చంపుకుని ఇంకా ఇక్కడే వాళ్ళిద్దరి కళ్ళముందూ పడివుంటావా ? నీకు యిల్లులేదా! చదువులేదా! నీకు ఏం తక్కువ! ఎందుకు ఇక్కడ పడివుండటం! నీ స్థానం రోజాకు ఏనాడో సొంతం అయి పోయింది. ఇంకా దేనికోసం ప్రాకులాడటం. పెళ్లయి మూడునెలలు తిరిగేసరికి నీ కలలు అన్నీ కరిగిపోయాయి. నీ సంతోషం మాయ మయి, నీ ఉత్సాహం చచ్చిపోయింది. ఇంకా నీకు ఇక్కడ ఏం మిగిలింది అని! వెంటనే ఇక్కడ నుండి వెళ్ళిపో! ఊఁ. త్వరగా వెళ్ళిపో !"

హరిత క్షణం సేపు పిచ్చి చూపులు చూస్తూ, అయోమయంగా ఆలోచనల్లో పడింది.

"ఇంకా ఆలోచిస్తున్నావా! ఊ! త్వరగా వెళ్ళిపో! ఈ వివాహ బంధాన్ని శాశ్వతంగా త్రెంచేసుకో! ఈ భర్త, ఈ సంసారం ఇక నీకీ జన్మలో వద్దు. వెళ్ళిపో !"

"వెళ్ళిపో, వెళ్ళిపో !" అంటూ అంతరాత్మ గట్టిగా అరిచింది. ఆ అరుపులకి హరితకు తల దిమ్మెక్కిపోయినట్టు అయి, ఒళ్ళు అంతా ముచ్చెమటలు పోసేసాయి. కాళ్ళు తేలిపోతున్నట్టు అయి ఒంట్లో నీరసం ముంచుకు వచ్చేసింది.

తను మనసులోనే ఒక నిర్ణయానికి వచ్చినట్టు తల పంకించింది.

* * *

తెల్లవారి కృష్ణసుమంత్‌కి హరిత ఎక్కడా కనిపించలేదు. అతనికి ఏదో అను మానం వచ్చి రోజాని అడిగాడు, హరిత ఏది అంటూ.

### 153 రోజులుగా అంతరిక్ష యానం

మాస్కో, వ్యోమగాములు లియోనిడ్ పొపొవ్, వాలెరి ర్యూమిన్ సెప్టెంబరు 8 నాటికి 153 రోజులుగా సమీప భూకక్ష్యలో పనిచేస్తూవున్నారు.

భూమిలో గల సహజ వనరుల గురించి వీరు పరిశోధన కొనసాగిస్తూ వున్నారు. భూమి ఉపరితలాన్ని, ప్రపంచ సముద్రాలనూ శాస్త్రీయ పరికరాల సాయంతో పరిశోధించి, ఫొటోలు తీస్తున్నారు

వ్యోమగాములు మంచి ఆరోగ్య పరిస్థితిలో ఉల్లాసంగా పనిజేస్తూ వున్నారు.

"నేను చూడలేదు, గదిలో లేదా ?" అడిగింది.

"గదిలో కనిపించకే నిన్ను అడిగాను."

"గదిలో లేదా! ఉండండి, నేను చూసి వస్తాను" అంటూ గదిలోకి వెళ్ళి చూసింది. ఆమె గదిలోనూ లేదు, యింట్లో ఎక్కడా లేదు. నౌకర్లను అడిగితే, తెల్లవారి ఎవ్వరూ అమ్మగార్ని చూడలేదు అన్నారు.

మళ్ళీ యిల్లంతా గాలించేశారు. ఎక్కడా కనిపించలేదు. కృష్ణసుమంత్‌కి ఏదో అనుమానం వచ్చి, భయం వేసినట్టుగా అయింది.

"మల్లిఖార్జునరావు వూళ్ళోలేడు. వాళ్ళు ఇంకా నాలుగు రోజుల్లోగాని రారు. హరిత ఎక్కడికి వెళ్లినట్టు! ఏమైనట్టు ?"

అతనికి ఒళ్ళు అంతా ముచ్చెమటలు పట్ట నారంభించాయి. అతని చూపులు టేబుల్‌పై వున్న కవరుపై నిలిచింది. ఆత్రుతగా దాన్ని అందుకుని విప్పిచూశాడు. ఉత్తరంలో ఇలా వుంది—

"ప్రియమైన మీకు,

మీరు కోరుకున్నట్టుగానే నేను మీకు దూరంగా వెళ్లిపోతున్నాను. మీ సుఖసంతోషాలకి నేను ఎన్నడూ అడ్డురాను. మీ సుఖమే నా సుఖంగా భావించి, దూరం అయిపోతు న్నాను. మన పెళ్లి అయ్యాక, ఈ యింట్లో కాలు పెట్టిన రోజున నా ఆనందం, సంతోషం చెప్పనలవికాదు.

సుందరమూర్తులు, ఉత్తములు అయిన మీరు నాకు భర్తగా లభించినందుకు నేను ఎంత పొంగిపోయానో! నా అంత అదృష్ట వంతురాలు మరొకరు లేరని గర్వించాను.

మరి ఈ రోజు పెళ్లి అయిన మూడు నెలలకే యింటి నుండి శాశ్వతంగా, మన వివాహబంధాన్ని త్రెంచుకుని వెళ్లిపోతున్నాను. ఈ యింటిలోనూ, మీ హృదయంలోనూ నాకు చోటు లేదని తెలిసాక ఇంకా ఇక్కడే వుండటం నా తెలివితక్కువ తనం. అందుకే వెళ్లిపోతున్నాను.

ఇక నాకోసం వెతికించవద్దు. వెతికించినా మీకు నేను కనిపించను. ఇక మీకు ఏమీ కాకుండా మిగిలిపోయిన దురదృష్ట వంతురాలు—

హరిత."

ఉత్తరం పూర్తిగా చదివిన కృష్ణసుమంత్‌కి వెన్నుమీద ఎవరో బలంగా చరిచినట్టు అయింది. కర్చీఫ్‌తో ముఖం ఒక్కసారి తుడుచుకుని, మళ్ళీ చదివాడు. బట్టలు మార్చుకుని కారులో ఎక్కడికో వెళ్ళిపోయాడు. వెళ్ళి పోయిన అతను తిరిగి రాత్రి పన్నెండు గంటలు అవుతుండగా వచ్చాడు. వస్తూనే బట్టలు అయినా మార్చకుండా మంచంమీద పడు కుండిపోయాడు.

ఆ ఉత్తరం అతని హృదయంలో తుఫాన్ లేవదీసింది. బాధతో కళ్ళు మూసుకున్నాడు. 'హరిత ఈ యింట్లోంచి వెళ్ళిపోయింది. ఆ మాట తలుచుకుంటే అతనికి ఎలాగో




# మువ్వల మురళి

ంది. ఆ రాత్రి అంతా అతనికి నిద్ర ను.

తెల్లవారి రోజా తప్పుచేసినట్టు ఒక ాలగా వుండిపోయింది. అది గ్రహించి ను "రోజా!" అంటూ పిలిచాడు.

'ఎందుకు!' అన్నట్టు మెల్లగా అతని దుటికి వచ్చింది.

"ఏమిటి అలా దూరంగా, పరాయిదానిలా ుండిపోయావు" అంటూ నవ్వబోయాడు, ని నవ్వురాలేదు.

"మీరు నన్ను క్ష మి ం చా లి. ఆమె ా మూలానే ఈ యింట్లోంచి వెళ్ళి ోయింది" అంటూ గద్గద స్వరంతో ెప్పింది.

"లేదు, లేదు. నీ మూలాన కాదు. తప్పు ంతా నాదే!"

ఆమె మాట్లాడలేదు. కళ్ళనీళ్ళు గిర్రున ిరగసాగాయి. కృష్ణసుమంత్ మరి సంభా ణ పెంచలేదు. టైము అవటంతో ోర్టుకు బయలుదేరి వెళ్ళిపోయాడు.

## 40

ఆ రోజు ఆదివారం. కృష్ణసుమంత్ ుదయం పని మీద ఎక్కడికో వెళ్ళాడు.

"బావగారూ! బావగారూ!" అన్న కంఠ స్వరం ఉరుములు లేని పిడుగులా వినిపిం ంది.

"బావగారూ!" అన్న కేక ఆ యిల్లు ంతా ప్రతిధ్వనించింది.

రోజా ఎవరా అని హాలులోకి వచ్చింది. 'ఎవరూ!" అంది.

మల్లిఖార్జునరావు ఆమెవైపు తీక్షణంగా మాశాడు.

"రోజా అంటే నువ్వేనా!" అతని కంఠ స్వరంలో హేళన ధ్వనించింది.

'తనపేరు అతనికి ఎలా తెలిసిందా' అని తృళ్ళిపడినట్టు చూసింది.

"ఏం అలా చూస్తావు! ఎవరా అనా?" అతని ముఖంలో కోపం తొంగిచూస్తోంది.

"నీ గుప్పెట్లో చిక్కుకుని బంధీ అయి పోయిన ఆ లాయర్‌గారు ఎక్కడ!"

అతని మాటలకి రోజా ముఖం ఎర్రగా కందిపోయింది. రోషంతో విసురుగా తల ఎత్తి అతనివైపు తీక్షణంగా చూసింది.

"మాట్లాడవేం! ఆయన ఎక్కడ!" అంటూ గద్దించి అడిగాడు.

అతని బెదిరింపులకి ఏ మాత్రం బెదర కుండా చీదరించుకున్నట్టుగా చూసింది.

"మీరు ముందు మర్యాద ఇచ్చి మాట్లా డండి" కోపంగా చెప్పింది.

"మర్యాద" అంటూ గట్టిగా నవ్వి, "నీకు నేను మర్యాద యిచ్చి మాట్లాడాలా!" అంటూ ఇంకా గట్టిగా నవ్వాడు.

"వేశ్యావాడలో వుండవలసిన నువ్వు, ఈ ఒంటిస్తంభం మేడలోకి రాగానే ఇల్లాలివి అ యి పో యా న ను కు ం టు న్నా వా? కాకి కలహంసగా, కంచు కనకంగా మారు తుంది అన్న నీ వెర్రిమొర్రి నమ్మకాన్ని కట్టి పెట్టు. వెలయాలు ఎప్పుడూ వెలయాలే! గృహలక్ష్మిగా జీవితంలో మారలేదు." అన్నాడు కరుకుగా.

"డోంటాక్! గెటౌట్ ఫ్రమ్ హియర్" అంటూ రోజా మండిపడుతూ వీధిగుమ్మం వైపు వేయ్యిపెట్టి చూపించింది.

"ఓహో అంతవరకూ వచ్చావా!" అంటూ అతను కనుబొమ్మలు పైకి ఎగరేసి ఆశ్చర్యం ప్రకటించాడు.

రోజా రోషంగా ముఖం తిప్పుకుంది, నీతో నాకు మాటలు ఏమిటి అన్నట్టు.

"నేను ఎవరో తెలిస్తే నువ్వు ఇలా వుంటావా! నీగుండె ఒక్కసారి ఆగిపోతుంది" నవ్వాడు.

"నా గుండె సంగతి అలా వుంచండి. లాయర్‌గారు ఇప్పుడువస్తే మీ గుండె ఆగు తుంది ముందు."

"రోజా!" పట్టరాని ఆవేశంతో, అవమా నంతో అరిచాడు.

"నేను తలుచుకున్నానంటే నిన్ను నామ రూపాలు లేకుండా చేసేస్తాను జాగ్రత్త! ఎవరనుకుంటున్నావో, ఏమో! నేను హరితకు అన్నయ్యను— నా చెల్లెలు స్థానం లాక్కుని, ఆమెను ఉసురుపెట్టి జలగలా పీడిస్తున్నావ్! ఈ ఇంటిని గబ్బిలంలా పట్టుకుని వేలాడుతూ, యింట్లో సుఖశాం తులు లేకుండా చేశావు! పచ్చని వాళ్ల కొత్త కాపురంలో చిచ్చుపెట్టావు. నా చెల్లెలు గుండెల్లో నిప్పులు పోసావు. నీ స్వార్థపు జ్వాలల్లో నా చెల్లెలి జీవితం భగభగ మండి పోతూ మసి అయిపోతూంది. ఈ ప్రపంచంలో ఇంతమంది స్త్రీలు వుండగా నా చెల్లెలు మీదే నీకు ఎందుకు ఇంత కక్ష. ఈ ప్రపంచంలో ఇన్ని సంసారాలు వుండగా ఈ కొత్త కాపురమే నీ కళ్ళకు పచ్చగా కని పించిందా! ఈ ప్రపంచంలో ఎందరో అయి శ్వర్యవంతులైన సుందర పురుషులు వున్నారే! ఈ కృష్ణసుమంతే నీ కళ్ళకు అందంగా కని పించాడా! ఒక్కగానొక్క చెల్లెల్ని అతి గారాబంతో, అరిచేతిలో ఆణిముత్యంగా, గుండెల్లో గులాబీగా, అపురూపంగా చూసు కున్న నా అనుజాత జీవితం కళ్ళముందే కూలిపోతుంటే చూస్తూ ఏ అన్నా చేతులు ముడుచుకుని కూర్చోలేడు" అంటూ ఆవే శంతో ఆమెవైపు చూశాడు.

మల్లిఖార్జునరావు కళ్ళు ఎర్రగా, నిప్పుల్లా వున్నాయి. అతని కళ్ళల్లో కసిరేగుతూంది. ఆ మె ను హత్య చేసేయాలనిపిస్తోంది. మనసుని బలవంతంగా పట్టి ఆపాడు.

రోజా మాట, పలుకూ లేనట్టు అలాగే నిశ్చేష్టురాలై నిలబడిపోయింది.

/ ఇ ం కా వు ం ది /

# కృష్ణమ్మ తల్లికి

# పుష్కరం పండుగ!

**కృ**ష్ణా పుష్కరాలు సెప్టెంబరు 26 వ తేదీ నుంచి ప్రారంభమై, అక్టోబరు 7 వ తేదీతో ముగుస్తున్నవి.

మత పరంగా పవిత్రమైన ఈ పుష్కరం పండుగ పన్నెండు సంవత్సరాల కొకసారి వస్తుంది. భక్తకోటి, దేశం నాలుగు చెరగుల నుంచి విచ్చేసి పవిత్ర కృష్ణానదిలో మునిగి తమ జీవితాలను ధన్యం చేసుకోవడమే కాక, భగవదనుగ్రహం కూడ పొందుతారు. కొంత మంది భక్తులు తమ పితృదేవతలకు తర్పణాలను, ఈ పుష్కర వుత్సవాల సందర్భముగా వదలుతారు.

హిందూ ధర్మ శాస్త్రానుసారం, రాశి చక్రంలోగల పన్నెండు రాశులలోను బృహస్పతి నివశిస్తూ తిరుగుతున్న కాలాన్ని, బృహస్పతి హిందూ దేశంలో గల పవిత్రమైన పన్నెండు మహానదుల్లోను తిరుగాడుతున్నట్లు హిందూ మతం విశ్వసిస్తున్నది. బృహస్పతి కన్యా రాశిలో ప్రవేశించినపుడు, కృష్ణానదిలో ప్రవేశించినట్లు చెప్పబడుచున్నది. బృహస్పతి ఈ కన్యారాశిలో ప్రవేశించుటను, కృష్ణా పుష్కర మహోత్సవాన్ని, అపురూపంగా భక్తకోటి పన్నెండు రోజులు జరుపుకుంటోంది. తర్వాత ఉప పుష్కరం పేరుతో, పన్నెండు రోజుల గడిచిన ఆరు రోజులను, ఆచరిస్తారు.

వ రక్షేమే శ్వ రు ని ఎనిమిది అంశాలలో పుష్కరం ఒకటిగా హిందూ ధర్మశాస్త్రం చెప్తోంది. బృహస్పతి తాను ప్రవేశించే పన్నెండు నదులలోని జలాన్ని, తాను అక్కడ వున్నంతకాలం పవిత్రంగా వుండేటట్టు బ్రహ్మదేవుని, పుష్కర దేవతను వేడుకుని, వారి సహాయ సహకారాలను అర్థించాడు. పుష్కరం మహోత్సవాలలో, నదులలో నీరు పవిత్రంగా వుండేటట్టు చూడటానికి, బ్రహ్మ, పుష్కర దేవతలు యింకా మిగిలిన ముప్పయిమూడు కోట్ల దేవతల సహాయాన్ని పొందారు. అందుచేత, బృహస్పతి రాశి మారినప్పుడు ( పుష్కరం వచ్చినప్పుడు ) మొదటి పన్నెండు రోజులు కాలంలో ఆయా నదులలోని నీరు పవిత్రమైన శక్తులతో నిండి వుంటుందని, మిగతా రోజుల్లో తెల్లవారు ఝామున, దైవశక్తి కొద్ది ఘడియలు మాత్రమే ఆ నీటిలో నిండి వుంటుందని హిందూ ధర్మశాస్త్రం చెప్తున్నది. ఇంత ప్రాశస్త్యం గల ఈ పన్నెండు రోజులు, విజయవాడలో కృష్ణానదీ తీరాన, పుష్కరాలు కన్నుల పండుగగా జరుగుతాయి. కృష్ణా—గుంటూరు జిల్లాలను కలిపే సేతువు, ప్రకాశంబ్యారేజి ప్రక్కనే వున్న దుర్గాఘాట్ నుంచి కృష్ణలంక చివరివరకు గల స్నాన ఘట్టాలు భక్తకోటికి ఎంతో రమణీయంగా అమిరాయి.



**కృష్ణవేణీమాత**

— మల్లిడి కనకరత్నం




ఎమ్. ఐ. — మోరి

నిత్యావసర వస్తువులు బ్లాకులో అమ్మితే సహించరు. కాని సినిమా టిక్కెట్లు బ్లాకులో కొం మూస్తారు జనం.

అది అంతే! సినిమా చూడకపోతే వచ్చే బాధ తక్కువ. తిండి గింజలు దొరక్కపోతే గడవదు. వినోదానికి వఠ్ఠియిచ్చినా ప్రమాదం లేదు. ఇవ్వగల వాడే కడతాడు.

శారద — సంగారెడ్డి

చీకటి తరువాత వెన్నెల వస్తున్నట్టే జీవితంలో కష్టాలు, సుఖాలువస్తుంటాయికదా! మరికష్టాలు రాగనే మనం కృంగిపోతామెందుకు?

సుఖాల జ్ఞాపకాలు వదలక!

కె. జి. హెచ్. — కుప్పం

ఒక కథ ప్రారంభించడం కష్టమా?ముగించడం కష్టమా ?

రాయడం అంటూ వస్తే రెండూ సులభమే.

దొంగ జపానికి కొంగ జపానికి తేడా ఏమిటి?

తేడా లేదు. అదొక రకం భుక్తికి, ఇదొరకం భుక్తికి.

పిహెచ్. ఎస్. — రాజమండ్రి

అలు మగలి మాటకడ్డు మాడినదేని అలుకాదు దనుజులుగాని అన్నసూక్తి తెలిసి కూడా మీరు ఆడవారితో భర్తకు ఎదురుతిరిగే నీతులు ప్రబోధించడం విచారకరమైన విషయం.

వివాదించండి, చెప్పిన మాట వినద్దని ఎవరంటున్నారు? మీ ఆత్మ గౌరవాన్ని సమూలంగా నాశనం చేసేలాంటి పరిస్థితి ఏర్పడితే అది భర్త చేతనైనా గాని ఎదిరించడంలో తప్పు లేదని చెప్పాలని నా తాపత్రయం. ఆడదాని అంతరాత్మపై రైనోసరస్ చర్మం కప్పబడి ఉంది. దాన్ని చీల్చుకుని ఆత్మగౌరవం వ్యక్తిత్వం అన్నమాటలు వారితో ప్రవేశించాలికదా అలా ప్రవేశించిన నాడే ప్రశ్న అడగండి. సంతోషిస్తాను. ఇప్పుడిదంతా కంఠశోషే,నాకూ తెలుసు.

వి. వి. ఎమ్. ఆర్. — కలకత్తా

మంచి స్నేహితుడు మనకి మంచే చెప్పాలి. ఏమంటారు ?

మంచి చెప్పొచ్చు, చేయొచ్చు. కాని మనకిఅద్దంలా తయారైతేనే చిక్కు! అద్దం మన ప్రతిబింబమే చూపుతుంది. కాని లోపాలు ఎత్తి చెప్పదే! మన మంచి కోరే స్నేహితుడు అదీ — ఇదీ కూడా చెయ్యాలి.

---


















# ప్రశ్నావళి

జి. వి. ఎన్. ఎస్ — కొత్తపాల్వంచ

మీ రచనల్లో ఎక్కువగా హీరో తండ్రి చెడ్డవాడు. [గోరంటాకు, దారి తప్పిన తండ్రి].

నా దృష్టిలో చెడ్డ తల్లి ఉండదు. కుటుంబాలు చితికిపోయేది బాధ్యత పంచుకోని తండ్రుల వల్లనేనని నేను నమ్ముతాను. ఎంత చెడిపోయిన తల్లి అయినా పిల్లల దగ్గరకి వచ్చేసరికి స్వార్థం పక్కకి తోసేస్తుంది. కాని తండ్రి అలా కాదే మధ్య తరగతి కుటుంబాలన్నీ ఒకసారి కన్నెత్తి చూడండి. ఉన్నత కుటుంబాలనొకసారి పరిశీలించండి. మీకే కళ్లకు కట్టినట్టు కన్పిస్తుంది. తల్లి తండ్రులలో తండ్రిని అధారిటీని, తల్లిని అభిమానానికి చూస్తారు పిల్లలు. అధారిటీతో ఆప్యాయత, అభిమానంలో డిసిప్లిన్ రంగరించకల్గిననాడే ఆ ఇంటి పిల్లలు సోదారిలో పెరుగుతారు. లేకపోతే తల్లిమీద నేరాలు చెప్పి తండ్రి మెప్పు సంపాదించే జులాయిలుగానో, ఇద్దర్నీ పోటీదార్లను చేసి పబ్బం గడుపుకొనే నేర్పరులుగానో తయారవుతారు. తండ్రికి తల్లిమీద గౌరవం లేదు సరికదా చిన్నచూపు కూడా అని తెలిస్తే ఆ ఇంట పిల్లలకి పట్టపగ్గాలుండవు, తల్లిమీద విలువ ఉండదు. తండ్రిని తెలివిగా వాడుకోనూకలరు. అందుకే పిల్లలకి తల్లీ తండ్రులే కాదు వాళ్ల మనుగడ విధానం కూడా చాలా ముఖ్యం. ఏ డాక్టరు జియా నాగరాజులాంటి వారిని అడిగినా ఇందులో నిజం చెప్తారు.

కె. జి. హెచ్. — కుప్పం

ఏ విధంగా తమ బిడ్డలకు నోర్పుతో నేర్పుతో నేర్పించే విధంగా ఇతరులకి ఎందుకు చెప్పరు ?

తల్లి జీవితం పుచ్చుకు చెప్పదు. జీతం యిచ్చిన చోట తల్లి మనసెలా ఉంటుంది? ఎందుకుండాలి?!

సాహిత్యం కృషితో వస్తుందా? పుట్టుకతోనా?

పుట్టుకతో గవంత ఉంటే కృషితో అనవ కాయంత చేయవచ్చు. లేదా పట్టుదల ఉంటే నిరక్షర రచయితలుగా కూడా రూపొందవచ్చు. చెప్పి రాయించో,రాయించుకునో—దీన్నే మనసుంటే మార్గం ఉంటుందనడం.

ఎ. ఆర్. కె. — ఏలూరు

ప్రేమ నిజంగా పవిత్రమైనదైతే లైలా మజ్నూ, సలీమ్, అనార్కలీ, దేవదాసు పార్వతి, బాలు స్వప్న [మరో చరిత్ర]లు, యింకా ఎందరో పవిత్ర ప్రేమికులు ప్రేమకు బలైపోయారు కదా? ఇంత మంది బలికొన్న ప్రేమ బలిఅనాలి. పవిత్రమంటారు దేనికో?

మన దేశంలో బలి కోరడమే స్వచ్ఛతకి, పవిత్రతకి చిహ్నం!!

పి. డి. ఆర్. — అక్కుపల్లి

ఎడ్యుకేటెడ్ వైఫ్ ఆర్ ఎ డబుల్ ఎడ్జిడ్ నైఫ్. కామెంట్?

ఫర్ ఎ బ్రూట్ ఒన్లీ!

ఇంకా ఎక్కువ ఇంధనము పొదుపు చేయండి !

# నిమిషాలలో వంటంతా చెయ్యండి





### అన్నం, పప్పు, కూరలు—ఒక్కసారే!

ప్రెస్టీజ్ వాడడం వల్ల దాని లోపలి గిన్నెలలో అన్నం, పప్పు, కూరలు మీరు ఒకే సమయంలో వండుకోవచ్చును. సాధారణంగా ప్రెషర్ కుకర్‌లో వంటకు పట్టే సమయం 15–20 నిమిషాలకన్న మించదు. ఆపైన తాలింపులకు మరో కొద్ది నిమిషాలు, అంటే మీ వంటంతా సిద్ధమయినట్లె.



### ఎక్కువ వండే చోటు కోసం మరింత పెద్ద గిన్నెలు!

కాని, గిన్నెలు వాడడం వల్ల వంటకు కావల్సిన చోటు మరి బాగా తగ్గిపోదా? ప్రెస్టీజ్ వల్ల అలా జరగదు! కుకర్ ఎంత విశాలంగా ఉందో, ఇంచుమించుగా అంత విశాలంలోనూ, గిన్నెలు పట్టేలా ప్రెస్టీజ్ డిజైన్ చేయబడింది. అందుకే అదే సైజుగల ఇతర డిజైన్ల కుకర్‌ల కన్న ప్రెస్టీజ్, గిన్నెల కోసం మరింత చోటు సమకూరుస్తుంది. మీ అంతట మీరే చూసి తెలుసుకోండి.



### ఎలక్ట్రిసిటి, గ్యాస్, కిరసనాయిల్, బొగ్గులు—పొదుపు చేయండి!

కిరసనాయిల్ లేక బొగ్గులు, ఎలక్ట్రిసిటి లేక గ్యాస్ పైనగాని ప్రెస్టీజ్‌తో అంతే నేర్పుగ వండవచ్చును. ఇది వంటకు పట్టే సమయాన్ని బాగా తగ్గిస్తుంది కనుక ఇంధనము ఖర్చులో పొదుపు. అటు డబ్బు, ఇటు సమయం కూడా పొదుపు చేయును.

## గిన్నెల కోసం ఎంత ఎక్కువ చోటు?

ప్రెస్టీజ్ కుకర్‌ని మీ అంతట మీరే చూసి తెలుసుకోండి. అదే సైజులు గల ఇతర డిజైన్ల ప్రెషర్ కుకర్‌లతో పోల్చి చూసుకోండి. ప్రెస్టీజ్ "ప్రీత్ 6.5" మెడల్‌లో గిన్నెల కోసం 51% ఎక్కువ చోటు దొరుకును. ప్రెస్టీజ్ "ఎలిగెంట్"లో అయితే 101% ఎక్కువ చోటు గిన్నెల కోసం. ఒకే సమయంలో పూర్తి వంటంతా చేసుకొనేందుకు ప్రెస్టీజ్‌ని మించిన ప్రెషర్ కుకర్ లేదు.

**Prestige**

## ఉచితం! "నిమిషాలలో వంటంతా చెయ్యండి" వివరాల పుస్తకము.

ఈ పుస్తకము కోసం, కన్స్యూమర్ సర్వీస్ మేనేజర్, ప్రెస్టీజ్ నేషనల్ సర్వీస్ సెంటర్, టిటి. (ప్రైవేట్) లిమిటెడ్, దూరవాణి నగర్, బెంగుళూరు 560 016 ఈ చిరునామాకు వ్రాయండి.

MCA-TT-55-Tel

# ప్రేమతీర్థం

## 6

**(గత సంచిక తరువాయి)**

ఈసారి దీపకి విజయవాడ చాలా నచ్చింది. ఆ రణగణ ధ్వనితో హడావిడితో ప్రాణం లేచివచ్చినట్లైంది. తీరా దీపను పరీక్ష చేసిన డాక్టర్ "రేపు ఒకసారి తీసుకు రండి. డెలివరీ డేట్ ఇస్తాను. ఈ రోజు ఆపరేషన్ వుంది" అంటూ హడావిడిగా వెళ్ళిపోయింది. చంద్రానికి ఏం చేయాలో తెలియలేదు. మళ్ళీ ఒకసారి వెళ్ళి రావటం అంటే అది దీపను శ్రమపెట్టటమే అనిపించి, ఆ రోజుకు స్నేహితుడింట్లోనే వుండేందుకు నిశ్చయించాడు. దీప మొదట విసుక్కున్నా, తరువాత మౌనంగా వుండిపోయింది ఆ విషయంలో! ఈ విషయం తెలిసినవాళ్ళు వెళుతుంటే శారదమ్మకు కబురు చేశాడు!

"దీపా! సినిమా ఏమైనా చూస్తావా? ఫ్రెండ్ ఇంటికి వెళ్ళిపోదామా!"

దీప క్షణం ఆలోచించింది. ఇంటికి వెళ్దాం అంటే, తనని వాళ్ళింట్లో దింపేసి తను ఎటో వెళ్ళిపోతాడు. ఆ స్నేహితుడికి నలుగురు పిల్లలు. అందరూ అసాధ్యులే! ఇప్పుడే వెళ్ళి ఆ కోతిమూకల అల్లరిలో పాలుపంచుకోవాలని లేదు. అలా అని సినిమాకి వెళ్ళాలనిలేదు.

"సినిమాలేవి ఎద్దు. డాన్‌బోర్. హాయిగా ఎటైనా వెళ్దాం" అంది దీప.

"దుర్గ గుడికి వెళ్దామా!"

"బాగుంటుందా?"

"చూద్దువుగాని."

పర్వదినం కాకపోవటంతో గుడిలో అట్టే జనంలేరు. ఐదురూపాయలు తీసి కానుకల పళ్ళెంలో పడేస్తున్న చంద్రాన్ని మహానందంగా చూస్తూ —

"శీఘ్రమేవ సుపుత్ర ప్రాప్తి రస్తు" అంటూ దీవించాడు పూజారి.

దీపను కూడా దీవించాలనుకొని శఠగోపరం నెత్తిన పెట్టబోతున్న పూజారిని చూసి, ఝడుసుకొని వెనక్కు వెళ్ళింది.

"అదేమిటి దీపా! రా, దీవిస్తారు ఆయన."

"వద్దు ... దూరం నుంచి దీవించమను. అది పెట్టి కొట్టక్కర్లేదు!"

**జరిగిన కథ—3 :** పెళ్ళి కాకుండనే తల్లి కాబోతున్న కూతురు దీపను పురుడు అయ్యేవరకు తనదగ్గర వుంచుకోమని న్యూయార్క్‌లో ఉంటున్న చెల్లెలు భామనుతి, అక్కయిన శారదమ్మకు ఉత్తరం వ్రాస్తుంది. ఆమె అనుమతితో శారదమ్మ పొలం వ్యవహారాలను చూస్తున్న చంద్రం ఏర్‌పోర్ట్‌కి వెళ్ళి దీపను తీసుకువస్తాడు. దీప వేషధారణను చూసి ఆ పల్లెలోవాళ్ళు ఆశ్చర్యంతో వింతజంతువును చూసినట్లు ప్రవర్తిస్తుంటారు. చంద్రం ప్రతీనెలా దీపను తీసుకెళ్ళి విజయవాడలోని లేడీడాక్టర్‌కు చూపించి తీసుకు వస్తుంటాడు. తనకు పుట్టబోయేబిడ్డను ఏ అనాధాశ్రమంలోనో జేర్పించి, తన తల్లిదండ్రుల వద్దకు వెళ్ళిపోతానని చెప్పిన దీపనుచూసి నివ్వెరపోతాడు చంద్రం. అలా ఆమె వదలివెళ్ళిపోయే పక్షంలో, పుట్టబోయే ఆ బిడ్డను తాను పెంచుకుంటానని చంద్రం శారదమ్మతో చెప్తాడు.

దీప మాటలకు చంద్రంతోపాటు పూజారి కూడా నవ్వాడు.

"భలే పిల్లవే నువ్వు..." అని, "సారీ! నీ అనుమతి లేకుండా 'నువ్వు' అనేస్తున్నాను. నీ కంటే వయస్సులో చాలా పెద్దవాడినిగా! నువ్వు అన్నా ఏమి అనుకోకు? నిన్ను చూస్తే పసిపిల్లలు గుర్తు వస్తారు."

"నీ మాటలు వింటే మాత్రం ముసలి తాత గుర్తొస్తున్నాడు. నీకు నువ్వు ముసలితనం అంటగట్టుకుంటే మాత్రం నువ్వు అలా కన్పించవద్దు ..."

"మానసికంగా నాకు, వాళ్ళకు తేడాలేదు దీపా ... ఇక వయస్సు ఈరోజు కాకపోయినా రేపైనా రాకపోదుగా!"

దీప అతని మాటలకు పకపక నవ్వేస్తూ... "ఆఁ! అన్నట్టు ఆ పూజారి పాపం నాకు పెళ్ళి అయిందనుకుంటున్నాడు. నిజానికి నా విషయం తెలిస్తే ఛీ ... పాతకి అని పొమ్మని వుండేవాడేమో!" అంటూ తిరిగి నవ్వసాగింది.

చంద్రం ఆమె వంక అర్థంగానట్లు చూశాడు.

"నా పక్కన నువ్వు వుండటం వలన ... అనవసరంగా ఈ పాప ఫలానికి నువ్వు తండ్రివి అవుతున్నావు ..." దీపే అంది తిరిగి.

"పాపం ఏమన్నా వుంటే మనదే! వాళ్ళు నిజంగా దైవస్వరూపులు."

"ఆఁ ఎలాగూ ఇంతదూరం వచ్చాంగా. ఈరోజు కూడా వుంటున్నాం. ఇంకో పని కూడా పూర్తిచేసుకొని పోదామా!" అంది సాలోచనగా చూస్తూ.

"ఏమిటది?"

"ఇక్కడేమైనా అనాథాశ్రమాలుంటాయేమో కదూ! వాళ్ళతో ముందుగానే చెప్పి, ఆ ఏర్పాట్లు చూస్తే...తరువాత నా పాస్‌పోర్ట్ హడావిడిలో నాకింక వీలవదు కూడాను."

చంద్రం చాలాసేపు ఏం మాట్లాడలేదు. "దీపా! నువ్వు ఏమి అనుకోకపోతే, నాదో రిక్వెస్ట్! నువ్వు ఎలాగూ అనాథాశ్రమాలకే ఇవ్వదల్చుకున్నప్పుడు ... ఆ పుట్టబోయే పాపని నాకే ఇచ్చెయ్యి. నేనే పెంచుకుంటా."

దీప నవ్వేసింది. "నీకేం ఖర్మ!"

"ఖర్మేముంది."

"మళ్ళీ పెళ్ళి చేసుకోవా?"

"చేసుకోను!"

"అదేం?"

"అదంతే!"

"సీతను మరిచిపోలేకా — లేక ఇంకో అమ్మాయిమీద ఇంట్రస్ట్ లేకా?"

"ఏదైనా కావచ్చు."

"సీత బాగుంటుందా!"

"ఆఁ నీ అంత."

"నా కంటే అను. నేనేమి అసూయ పడనులే!"

"చనిపోయింది కదా అనా!"

"ఔను! అదే బాధ. ఎందుకు చనిపోయింది?"

"మళ్ళీ అదేం ప్రశ్న."

"చెప్పు చంద్రం. సీత గురించి చెప్పు. నీ గురించి చెప్పు — ఏదైనా చెప్పు. ఇక్కడకొచ్చాక మాట్లాడేందుకు ఎవ్వరూ లేక పిచ్చెక్కుతోంది. పెద్దమ్మ ఎంతసేపు పురాణాల గురించో, పాలాల గురించి మాట్లాడుతుంది. ఇంక నువ్వేమో... అస్సలు వులకవు, పలకవు. మీరంతా మౌనంగా అంత మెకానికల్‌గా ఎలా బతగ్గలరో చూస్తుంటే, ఆశ్చర్యంగా వుంది. అది సరే, ముందు నీ గురించి చెప్పు."

"అటు చూడు. ధగ ధగ మెరుస్తూ దీపాలతో విజయవాడ ఎంత మిడిసిపడుతోందో..." చంద్రం దీప మనసును మరో వైపుకి తిప్పాలనుకొని అన్నా, అది దీపపై ఏం ప్రభావం చూపెట్టలేదు.

"న్యూయార్క్‌లో మా ఫ్లాట్‌నుంచి చూస్తే, రాత్రిళ్ళు అక్కడ వీధులు ఇంతకంటే బాగుంటాయి."

"నువ్వు ఆ కళ్ళతో చూడకు."

"నీ కళ్ళతో చూడటం నాకు రాదు."

"పరే పోదామా..."

"వద్దు... ఇక్కడ బాగుంది. చల్లగా గాలి వీస్తూ. అన్నట్టు నీకు పుట్టబోయే పాప కావాలన్నావుగా... వీగురించి ఏమి పూర్వాపరాలు తెలుసుకోకుండానే ఇచ్చేస్తానుకున్నావా!"

"నాకు తెలుసులే... అలా అంటే కాని నేను నీకు లొంగనని తెలుసుకున్నాను..."

"సరే, తెలిసిందిగా చెప్పు."

దీప మారం చూస్తే బిస్కెట్ కావాలని మారం పెట్టే పసిపిల్లలు గుర్తుకొచ్చారు చంద్రానికి. హఠాత్తుగా చంద్రం కళ్ళు దీపను పరిశీలించాయి. వచ్చినప్పటికంటే శారదమ్మగారి పోషణలో కొంచెం వళ్ళు వచ్చింది దీపకు. కళ్ళలో ఆ అమాయకత్వం, మొహంలో పసితనం, నెలలు వస్తున్నకొద్దీ నిండుగా, అందంగా తయారౌతోంది. కాని తన కిష్టంలేని భారాన్ని మోస్తూ, 'ఎప్పుడు ఈ గొడవ వదిలి తను మళ్ళీ ఆ దేశం వెళ్ళిపోతానా' అని ఆ అమ్మాయి అనుకుం



టున్నదని తెలిసి చంద్రం మనసు బాధగా మూలిగింది.

''ఏమిటలా చూస్తున్నావు ?''

''ఏం లేదు.'' ఉలిక్కిపడ్డాడు చంద్రం.

''ఈసారి ఏం చెప్పి నాటెయ్యాలనా !''

''కాదు దీపా! నేనేమంత గొప్పవాడిని కాదు. ఏ వివేకానందుడి జీవిత చరిత్రో అడుగు, ఆనందంగా చెబుతాను. ఏదో ఒక దౌర్భాగ్యపు గతం నాది. అది పునశ్చరణం చేసుకున్నందువల్ల ఎవరికి ఆనందం చెప్పు... ?''

''నీకంత బాధ కలిగిస్తే వద్దులే'' దీప ఈసారి బలవంతం పెట్టదలుచుకోలేదు.

''కోపమా ! సరే విను... ఎప్పుడు విసుగేస్తే అప్పుడు చెప్పు వెళ్ళిపోదాం... సరేనా ?...''

## 7

''నాకు అమ్మా, నాన్న పెట్టిన పూర్తి పేరు చంద్రశేఖర్ ! ఇంట్లోవాళ్ళు ముద్దుగా చంద్రం అనీ, స్నేహితులు మాత్రం శేఖర్ అని పిలిచేవాళ్ళు. నేను పుట్టాక నాన్నగారికి బిజినెస్‌లో మంచి లాభాలు వచ్చాయట. దానికో, అమ్మకి ఇక పిల్లలు పుట్టే ఆశ లేకపోబట్టో తెలియదు గాని ఇంట్లో చాలా గారాబంగా జరిగేది. అయితే ఆ గారాబంవలన నా చదువు, నా భవిష్యత్ ఏది పాడవలేదు.''

''నీది, సీతది లా మారేజ్ అని చెప్పింది పెద్దమ్మ. నిజమేనా ? మధ్యలో అడ్డొస్తున్నాను.''

''నిజంగానే మాది లా మారేజే !''

''ఇండియాలో లా మారేజస్ ఎలా జరుగుతాయో తెలుసుకోవాలని వుంది. ఆ కంట్రీస్‌లో అయితే పరిచయం చేసుకోవడం, పెంచుకోవటం చాలా తేలిక. చొరవ ఎక్కువ. అయితే నాకు నచ్చింది, వాళ్ళు అన్నిటిని తేలిగ్గా తీసుకోవటం. చాలా రోజులు కలసి మెలిసి తిరిగి డేటింగ్స్ ఇచ్చుకున్నాక కూడా నచ్చకపోతే విడిపోతారు.''

''ఇండియాలో ఫారిన్ కంట్రీస్ ప్రభావం చాలావరకు పడుతోంది. బాంబే, ఢిల్లీ, కలకత్తా లాంటి సిటీస్ అయితే చెప్పక్కర్లేదు. ఫ్యాషన్స్, క్లబ్స్, డ్రింక్స్ ఒకటేమిటి అన్నీవున్నాయి. జట్లు జట్లుగా బాయ్ ఫ్రెండ్స్‌ని తీసుకొని సినిమాలకి, హోటల్స్‌కి వచ్చే ఆడపిల్లల్ని బాంబేలో చాలా మందిని చూశాను. అదంతా పెళ్ళివరకు వెళ్తుందని నేను అనుకోను. అదొరకం లైఫ్. అంతే ! అయితే సీతతో నాకు పరిచయం ఏ కాలేజీల్లోను, ఏ క్లబ్‌ల్లోనో, పార్కుల్లోనో అయింది కాదు.

ఆరేళ్ళక్రితం బాంబేలో ఎమ్. టెక్. చదువు ముగించుకొని హైద్రాబాద్ రావాలని టిక్కెట్ బుక్ చేసుకోవటానికి క్యూలో నుంచున్నాను. బాంబేలో సినిమా టిక్కెట్లు కైనా, రైల్వే టిక్కెట్లుకైనా ఒకే రకం క్యూ. కొత్తల్లో పొద్దున వెళ్ళి, సాయంకాలం వచ్చిన రోజులున్నాయి. అయితే కాస్త అక్కడ వుండటం అలవాటు పడ్డాక, తెలివి మీరాక నాకో సంగతి తెలిసింది—''ఆ క్యూలో నుంచునే వాళ్ళందరికీ టిక్కెట్లు అవసరం లేదనీ, కొంతమంది వాళ్ల ప్లేసెస్ అమ్ముతారని'' అంతే! ఆలస్యంగా వెళ్ళినా ముందు జేరిపోయేవాడిని. ఆ రోజు అలాగే జరిగింది.

''మీకేం అభ్యంతరం లేకపోతే, నాకు హైద్రాబాద్ స్లీపర్‌లో ఒక టిక్కెట్ తీసిపెట్టగలరా'' అని హిందీలో అడుగుతున్న ఒక స్త్రీ గొంతు విని ఉలిక్కిపడి చూసాను. సన్నగా కట్ చేసిన కనుబొమల మధ్య పెద్ద కుంకుమ, కళ్ళకు పెద్ద గాగుల్స్. బుజానికి వేళ్ళాడుతున్న సాఫ్ట్‌షేప్ బాగ్, చిన్న చిన్న పూలున్న గంజి పెట్టిన ఇస్త్రీ చీర, జుట్టు పొట్టిగా బుజాలమీద పడుతుంటే, మెల్లగా అర్థిస్తున్న ఆమె మొహం నాజూకుగా మెత్తగా మెరుస్తోంది.

'అలాగే' అన్నాను అప్రయత్నంగా. పేరు, అడ్రస్ వ్రాసి డబ్బు అందిచ్చింది.

నాతోపాటు ఆమెకూ కూడా ఒక టిక్కెట్టు తీసుకొని బయటపడ్డాను.

''థాంక్స్ ఎ లాట్'' అంది నేను ఇచ్చిన చిల్లర, టిక్కెట్ అందుకొని బ్యాగ్‌లో వేసుకుంటూ.

''మీరు తెలుగువారా !'' అని అడిగాను వుండబట్టలేక.

''ఆం మీరు తెలుగువారేనా... నాలాగా బాంబే చూడటానికి వచ్చారా ?''

''లేదండి. నేను ఇక్కడే ఎమ్. టెక్ చదివాను. ఇంటికి వెళుతున్నాను... మీరేం చేస్తున్నారు ?''

''హైద్రాబాద్‌లో ఒక ప్రవేట్ కంపెనీలో రిసెప్షనిస్ట్‌గా పని చేస్తున్నాను. ఇక్కడ 'అంధేరి'లో మా పిన్నివాళ్ళున్నారు. వాళ్ళింటికే వచ్చాను.''

''బాంబే అంతా చూసారా! మీ పేరు సీత అనుకుంటా'' ఇందాక పేరు, అడ్రస్ వ్రాసి ఇవ్వటంతో ఆమె చెప్పకుండానే తెలిసి పోయింది.

''ఔనండి. ఆల్ మోస్ట్ బాంబె అంతా చూసాం. ఎలిఫెంటాకేవ్స్, హాంగింగ్ గార్డెన్స్... వగైరా. నిన్ననే పూనా కూడా వెళ్ళివచ్చాం తెలిసినవాళ్ళుంటే. పూనా చాలా బాగుంది. బాంబె నుంచి వెళితే మరీ హాయిగా వుంటుంది. చాలా కామ్ ప్లేస్.''

''ఇక్కడ బోరు కొట్టేసిందా ?''

''రియల్లీ. ముఖ్యంగా ఈ ఎలక్ట్రిక్




మీలాంటి
మగవానికి
తృప్తినిచ్చేది—చార్మినార్!
CHARMINAR
THE VAZIR SULTAN
TOBACCO CO. LTD.
10 CIGARETTES



విశ్రమిస్తున్న ఏనుగువలె కనపడుతున్న మంగళగిరి కొండ — పానకాలస్వామి —ఫోటో : ఏలేశ్వరపు నరసింహారావు

# ప్రేమ తీర్థం

ట్రైన్స్‌మీద ప్రయాణం కంటే, హైద్రాబాద్‌లో ఆ సిటీబస్‌లో నయం అనిపించింది. ప్రతిదానికి చాంతాడేసి క్యూ. తెల్లవారి లేచిన దగ్గరనుంచి ఉరుకులు, పరుగులు. ఎందుకొచ్చిన హడావిడి !! మా పిన్నిగారి అమ్మాయిలిద్దరూ ఏవో చిన్న ఆఫీసుల్లో పని చేస్తున్నారు. నేను లేచేసరికే వెళ్ళిపోతారు. ఎప్పుడో ఆరింటికి వేళ్ళాడేసుకున్న ముఖాలతో ఇంటికొస్తారు. నిజం చెప్పద్దూ! వాళ్ళను చూస్తే జాలివేస్తోంది."

సీత చెప్పే తీరుకు నాకు నవ్వు వచ్చింది.

"సినిమాలేవి చూడలేదా ?"

"సినిమాలా ... చెప్పకండి. పాత సినిమాలక్కూడా పెద్ద క్యూలే. శాంతరావ్ సహేబ్, సైగల్ దేవదాసు చూసాను. అవీ ఏవో చెత్త థియేటర్లో ఆడుతుంటే !"

ఇద్దరం మాట్లాడుకుంటూ బస్‌స్టాప్ దాటిపోయాము.

"సారీ ... ఏదో వాగేస్తున్నాను కొత్త, పాత లేకుండా. ఇక వెళతానండి. మా పిన్ని ఏవో తెమ్మని చెప్పింది. మెల్లగా కొనుక్కుని, అక్కడ నుంచి ఆటోలో వెళతాను." అంటూ మెరుపుతీగలా మాయమైంది.

సహజంగా ఆడపిల్లలతో అంతగా మాట్లాడే అలవాటులేని నాకు, సీతతో అలా కబుర్లు చెప్పటం నాకే ఆశ్చర్యం కలిగించింది. నా క్లాస్‌మేట్స్ కొందరు నా ముందే హేళనగా మాట్లాడినా పట్టించుకొనేవాడిని కాదు ఈ విషయంలో. కొంతమంది గర్ల్స్ వాళ్ళంతట వాళ్ళే చొరవగా సినిమాలకి, పార్టీలకు రమ్మన్నా మృదువుగా తిరస్కరించే వాడిని. కాని ఆరోజు అందుకు భిన్నంగా వుంది నా ప్రవర్తన. సీత కలుపుగోలు తనం ముఖ్యంగా నాకు నచ్చింది !

ప్రయాణం రోజు రానే వచ్చింది.

సీత ఇంచుమించు ట్రైన్ కదిలే ముందు హడావిడిగా పరిగెత్తుకొచ్చింది. వెంట బహుశా సీత బాబాయి, పిన్ని కాబోలు వచ్చారు.

"వుంటా పిన్నీ ! వెళ్ళొస్తా అంకుల్ !"

"వెళ్ళగానే ఉత్తరం వ్రాయి."

"అలాగే! పంకజని, ప్రతిమని హైద్రాబాద్ పంపండి. కొన్నిరోజులు వుండి వస్తారు."

"అలాగే. శెలవు దొరకాలికదా !"

ట్రైన్ ముందుకు పోతుంటే, సీత దూరమౌతున్న తన వాళ్ళకు చేయి వూపుతూ చాలాసేపు గుమ్మంలోనే నిలబడింది.

"చాలా లేట్‌గా వచ్చారే !" అన్నాను, సీత వచ్చి నా ఎదురు సీట్లో కిటికీ దగ్గర కూర్చోగానే.

"అబ్బ ! ఏం టాక్సీలు బాబు...ఒక్కటీ దొరికి ఛస్తేగా ... గుడ్‌బై టూ బాంబే. దానికి తోడు స్టేషన్‌లో ఏదో షూటింగ్ వుందిట. ఒకటే రష్..." అంది నుదుటను పట్టిన చెమటను సున్నితంగా కర్చీఫ్‌తో అద్దుకుంటూ.

"మీది అప్పర్ బెర్త్ అనుకుంటాను."

"ఔనేమో ... నేను ఇంకా చూసుకో లేదు."

"ఫరవాలేదు లేండి. మనం ఛేంజ్ అవచ్చు."

"అబ్బే. మీకా శ్రమ వద్దు. నేను నిక్షేపంగా పైకివెళ్ళి పడుకోగలను. సామాన్లు కాస్త చూస్తుండండి. చాలు." అంటూ తన బ్యాగ్ తెరచి, కాడ్‌బరీస్ మిల్క్‌బార్ తీసి నాకొకటి ఇచ్చి తనొకటి తీసుకొంది." ఇక్కడ బాగా చౌకండి మనవైపు కంటే ... ఎన్ని కొన్నానో ... కరువో, కాటకమో అని ..." తన బ్యాగ్ తెరచి చూపించింది ... పది పదిహేను ప్యాకెట్స్ వున్నాయి.

నాకు నవ్వాగలేదు. "అంత ఇష్టమా !" అన్నాను నవ్వాపుకుంటూ.

ఔనన్నట్లు తలూపింది.

ఆ రాత్రి పడుకునేవరకు సీత ఏవో కబుర్లు చెబుతూనేవుంది. తన కాలేజీ విషయాల దగ్గరనుంచి తన ఉద్యోగం చేరిన వరకు ఏవో, ఏవో. సీత సున్నాలాంటి మూతి మాట్లాడుతున్నప్పుడల్లా అది ప్రకటించే అభినయం చూస్తూ, మైమరచిపోయాను. కాలం ఎలా గడిచిపోయిందీ, ఇద్దరికీ తెలియ లేదు.

భోజనం అవగానే గుడ్‌నైట్ చెప్పి పైన తన బర్త్‌మీద కెళ్ళిపోయింది...

అలా ప్రారంభం అయింది సీతతో నా పరిచయం.

(ఇంకా వుంది)

# శుభ్రమైన తాజా శ్వాస...
# ఆరోగ్యం చిందే గట్టి పళ్ళు



## కోల్గేట్
### డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంది. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే అహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది, అవి ముందు నోటి దుర్వాసన అపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు,-పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన అహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా తోముకుచేరి హానికరమైన అహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది



ఫలితం ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

***నోటి దుర్వాసనను ఆపండి...***
***కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో***
***దంతక్షయాన్ని ఎదుర్కోండి!***




DC.G.74 TL

ఎస్. ఎస్. — సికింద్రాబాద్

నా ముందరి పళ్ళు నాలుగు ఎత్తుగా వున్నవి. పళ్ళ మధ్య సందులు గూడా వున్నవి. క్లిప్పు వాడినందువల్ల పళ్ళు ఎత్తు తగ్గి, దగ్గరకు వచ్చే అవకాశము వున్నదా ? ఈ క్లిప్పులకు ఎంత ఖర్చు అవుతుంది ? ఉచితంగా ఈ క్లిప్పులను వేసే దంత వైద్యశాలలు హైదరాబాద్‌లో వున్నాయా ?

★ దంతక్రమం సరిగా అవుతుందా లేదా అనేది వయస్సునిబట్టి ఉంటుంది. చిన్న వయస్సు వారికి తప్పకుండా పలువరుస క్రమం అయ్యే అవకాశం క్లిప్పులు వాడటంవల్ల ఏర్పడుతుంది.

పలువరుసనిబట్టి క్లిప్పుకి అయ్యే ఖర్చు ఉంటుంది. హైదరాబాద్‌లో క్లిప్పులు దంత కళాశాలలో వేస్తారని నా ఊహ ! ఉచితంగా వేస్తారో లేదో నాకు తెలియదు.

ఎమ్. ఎమ్. — మార్కాపురం

నాకు ఇప్పుడు 32 సంవత్సరములు. ఈమధ్య డాక్టరు దగ్గర పరీక్షించగా షుగర్ వున్నట్లు చెప్పినారు. ఈ షుగర్ వచ్చుటకు కారణమేమిటి ? ఇది పూర్తిగా ఇంగ్లీషు మందులవల్ల తగ్గుతుందా ?

★ ఈ రోగాన్ని ''డయాబెటిస్'' అని అంటారు. శరీరానికి అవసరమైన దానికన్నా ఎక్కువ మోతాదులో పిండిపదార్థాలు (కార్బోహైడ్రేటులు) అందుతూ ఉండి, అదే సమయంలో వీటి ప్రమాణాన్ని అదుపులో ఉంచగల ''ఇన్సులిన్'' ఉత్పత్తి శరీరంలో తగ్గినప్పుడు ఈ రోగం రావటం జరుగుతుంది.

ఈ రోగం ఇంగ్లీషు మందులవల్ల అదుపులో ఉంటుంది. మందులు మాత్రం వాడితే ఈ రోగం నయంకాదు. ఆహార విషయాలలో వైద్యుల సలహాను తప్పక పాటించవలసి ఉంటుంది.

# డాక్టర్ సలహాలు

ఎల్. డి. కె. ఆర్. — ఈల్రపోలు

'త్రెడ్‌వర్మ్స్' వున్నవాళ్ళు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి ? వాటిని పూర్తిగా నిర్మూలించాలంటే ఏఏ మందులు వాడాలి ? వాటివలన నష్టపోయిన శక్తిని ఏవిధంగా సమకూర్చుకోవాలి ? ఆహార విషయంలో ఏఏ శ్రద్ధ తీసుకోవాలి ?

★ ఈ ''నులిపురుగులు'' మనలోనుంచి తిరిగి మనకే చేరగల క్రిములు. మంచి అలవాట్లు లేని కుటుంబాలలో ఈ రోగం నిరంతరం ఉంటుంది.

కుటుంబంలోని వారందరికీ ఒకేసారిగా పైపరజీన్ ''సిట్రేట్'' లేక ''అడిపేట్'' మాత్రలు వైద్యుల సలహా ప్రకారం తగు మోతాదులో ఇవ్వటం అవసరం.

ఈ నులిపురుగులవల్ల శక్తి పెద్దగా పోదు. పరిశుభ్రమైన ఆహారాన్ని తీసుకోవటం, కాయగూరలని బాగా కడిగి వండటం మాత్రమే తీసుకోతగిన జాగ్రత్తలు. గోళ్ళను ఎప్పుడు దగ్గరగా కత్తిరించి ఉంచుకోవాలి.

డి. ఎ. — విజయవాడ

మా అమ్మగారి వయస్సు 45 సంవత్సరములు. ముఖముమీద, మెడమీద గోధుమరంగు మచ్చలు వచ్చినవి. ముందు కొంచముగా వచ్చి తరువాత ముఖము, మెడ అంతా అల్లుకొంటున్నవి. ఇవి రావటానికి గల కారణాలు ఏమిటి ? వీటి నివారణోపాయము తెలుపప్రార్థన.

★ ఈ మచ్చలు రావటానికి అసలు కారణం పుట్టుకతోనే ఏర్పడుతుంది. కాని రోగ లక్షణాలు మాత్రం జీవితంలో ఎప్పుడైనా బహిర్గతం అవవచ్చును. చర్మంలోని మెలనిన్ పిగ్‌మెంట్ నిర్మాణంలో అవకతవకలు ఏర్పడినప్పుడు ఇలా జరుగుతుంది.

కొన్ని సమయాలలో ఈ మచ్చలు వాటంతటకవే తగ్గిపోతాయి. ఏమైనా మీరు నిపుణులైన చర్మ వైద్యుల సలహా పొందితే మంచిది.

కె. ఆర్. డి. — కపిలేశ్వరపురం

మా అమ్మాయి వయస్సు 11 సంవత్సరములు. చాలా లావుగా వుంటుంది. నడుస్తుంటే చాలి వస్తుంది. దీనికి ఏమి చెయ్యాలి ?

★ ఆహార విధానాలలో మార్పు క్రమక్రమంగా తీసుకురావటం అవసరం. ఒకేసారిగా ఆహారం తగ్గించటం, లేక అన్నం మాని గోధుమలు, ''టిఫిన్లు'' ఇవ్వడంవల్ల ఈ రోగం నయంకాదు. నడిస్తే చాలి వస్తుందని అసలు నడవకుండా ఉంటే రోగం నయంకాదు. కొంచెం కష్టం అయినా కూడా ఓర్చుకొని ఒక నిర్ణీత దూరం నడుస్తూ వచ్చి, వెంటనే పెద్దపెట్టున ఆహారం తీసుకోకుండా జాగ్రత్తపడితే లావు తగ్గుతుంది.

—డా॥ కె. వెంకటేశ్వరరావు







'ప్రేమ పిచ్చి'లో
కమల్, రతి

## దాసరి నామకరణం చేసిన ఇద్దరు తారలు

★ "దీపారాధన" చిత్రం ద్వారా తెలుగు చిత్ర వీక్షకులకు పరిచయం గావింపబడే శివరంజని అసలు పేరు వడివుక్కరశి తన పేరును 'శివరంజని'గా డైరెక్టర్ దాసరి నారాయణరావు ఎందుకు మార్చారో వివరిస్తూ ఆమె, "వారి శివరంజని – చిత్రంలో ఓ పాత్రకు కొత్త నటిని పరిచయం చేయాలనుకున్నారు మొదట్లో వారి శ్రీమతి పద్మగారికి, నాకు పరిచయం ఉంది వాళ్ళ పిల్లలకు ట్యూషన్ చెప్పడానికి టీచరమ్మ కావాలంటే, మా అక్కయ్యను సూచించాను ఒకరోజు పద్మగారు 'టెలివిషన్ సెంటర్‌లో అనౌన్సర్‌గా ఉన్న నువ్వు సినిమాల్లో ఎందుకు నటించకూడదు ? ఎక్స్‌ప్రెషన్స్, డైలాగ్ డెలివరీ ఎక్సలెంట్‌గా ఉన్నాయి' అన్నారు అనడమే కాకుండా మేకప్ టెస్ట్‌లో పాల్గొనమని బలవంతం చేశారుకూడా కాని, నాకప్పుడంతగా సినిమాలలో నటించాలనే ఉబలాటం లేదు ఆ మూడ్‌లో మూవీ కెమెరా ముందు బిగుసుకుపోయానేమో -- 'ఓకే' కాలేదు దరిమిలా రెండు మూడు తమిళ చిత్రాల్లో ఛాన్సులు తగిలి, క్రమక్రమంగా అనుభవం సంపాదించాను మంచి పేరుకూడా తెచ్చుకోగలిగాను. 'దీపారాధన' చిత్రానికి దాసరిగారి వద్దనుంచి కబురు వచ్చింది 'ఆ రోజు నీకు సినిమాల్లో నటించడం ఇష్టంలేదని బిగువు చూపించావు ఇప్పుడు పెద్ద స్టార్‌వి అయిపోయావే ! మా శివరంజని – చిత్రం మూలంగా నువ్వు పరిచయం కాకపోయినా – ఆ గుర్తుగా, ఆ పేరుతోనే నువ్వు తెలుగు ప్రేక్షకులకు పరిచయమైతే ఎలా ఉంటుందమ్మాయ్ ?' అన్నారాయన. 'మీ ఇష్టం ?' అన్నాను. ఆ పేరు ఓ–కే అయింది," అందా యువతి లఘువుగా నవ్వుతూ.

★ లలితా మూవీస్ "స్వప్న" చిత్రంలో ఓ ప్రధానభూమిక నిర్వహించే రాజస్థానీ యువతి "నా అసలు పేరు మంజరి. నాకు 'స్వప్న' అనే పేరు బాగా ఉంటుందని దాసరి నారాయణరావుగారు అలా మార్చారు," అంది స్వప్నసుందరిని తలపుకు తెచ్చే ఆమె సొగసులు చూస్తుంటే, ఆ పేరే ఆమెకు కరెక్ట్‌గా మ్యాచ్ అవుతుందని ఇట్టే అనిపిస్తుందెవరికైనా. మద్రాసులోనే చదువుకున్నందువల్ల తమిళం కాస్తకూస్త వచ్చు. "తెలుగు కూడా కుంచెం కుంచెం వచ్చు," అంది ముద్దుముద్దుగా. తెలుగు బాగా నేర్చుకుంటోందిట ఇప్పుడు. "ఐతే, కొద్ది రోజులు పోయాక నాకే నేర్పిస్తారన్నమాట ?" అన్నాను. పక్కున నవ్వింది దానిమ్మగింజల్లాంటి పలువరుసను చూపిస్తూ. అందాల పోటీలలో తను రెండుసార్లు బహుమతులు కాజేసిందట. ఇంకా ఎన్నిసార్లు కాజేస్తుందో – అనిపిస్తుంది ఆమె హంసగమనం చూస్తుంటే. కొన్ని తమిళ, కన్నడ చిత్రాల్లోనూ బుక్ అయింది. కె. ఎస్. ఆర్. దాస్ డైరెక్షన్‌లో బెంగళూరు అజంతా మూవీస్ వారి తెలుగు, కన్నడ భాషల్లో ప్రారంభించే చిత్రంలో చిరంజీవి సరసన నాయికగా ఎన్నుకోబడింది ప్రభు చిత్రవారి ద్వితీయ చిత్రంలో కూడా అతని పక్కన నటిస్తోంది "ఊటీలోని సరస్సులో ప్రభు చిత్రవారి షూటింగప్పుడు ఓ తమాషా జరిగిందండి నన్ను చిరంజీవిగారు ఆ సరస్సులోకి తోసేస్తే నేను మునిగిపోయే సీను ఆ చిత్రంలో ఈత తెలియని పాత్ర అన్నమాట నాది ప్రమాదం జరక్కుండా ఉండేందుకు నీళ్ళ అడుగున కనిపించకుండా నా కాలికి కట్టడానికి పెద్ద తాడు తెప్పించారు ప్రొడ్యూసర్ రాయపరాజుగారు నాకు ఈత రాదేమో అని ఆయనా, డైరెక్టర్ చిట్టిబాబుగారూ అనుకున్నారట చేపలా ఈదగలననీ, స్విమ్మింగ్ పోటీలలో కూడా ప్రైజులు గెలుచుకున్నాననీ ఎంతగానో చెప్పాను అయినా, నా కాలికి తాడు కట్టడం సేఫ్‌సైడ్‌గా ఉంటుందన్నారు అక్కర్లేదని ఒప్పించాను షూటింగప్పుడు ఆ నీళ్ళలో పడిపోయి, ఊపిరి బిగబట్టి కాస్సేపటివరకు లోపలే ఉండిపోయాను – డైరెక్టర్‌గారు ఆ షాట్‌ను ఓ–కే వేయడం వినిపించదు గనుక కాస్సేపటివరకు అలాగే ఉండిపోయాను ఎందుకైనా మంచిదని నా ఉద్దేశ్యం వాళ్ళకేం తెలుసు ? నేను మునిగిపోయానేమో – అని గాభరాపడిపోయారట నేను పైకి తేలేవరకు ప్రభు చిత్ర యూనిట్‌లోని ప్రతి ఒక్కరూ భయభ్రాంతులతో చూస్తుండిపోయారు అబ్బా ! ఆ సరస్సులో నీరు ఎంత మురికిగా ఉందనుకున్నారు ! ఆ తర్వాత ఎన్నోసార్లు 'లిస్టరిన్ మౌత్‌వాష్'తో నోరు గార్గల్ చేసుకున్నాను," అని చెప్పింది స్వప్న నవ్వుతూ.



'రోజులు మారాలి'లో ప్రభ



'ఆశాజ్యోతి'లో
మురళిమోహన్, సుజాత

## సినిమా

### అమృత కలశంలో విష కీటకం

పాపను తులసి (మంజుభార్గవి) ముద్దు పెట్టుకుంటూండగా వికటాట్టహాసం వినిపించింది తులసి అదిరిపడి పక్కకు తిరిగింది పానకాలు (రాళ్ళపల్లి) కనిపించాడు "ఎందుకొచ్చావ్ ?" అంది తులసి

"ఎందుకొచ్చానో తెలీకే అడుగుతున్నా వనుకోవా, పాపా ? అయినా, మేనమామని పట్టుకొని 'ఎందుకొచ్చావ్ — ఎన్నాళ్ళుంటావ్ ?' అని గుమ్మంలోనే అడగొచ్చా ? అవునూ — ఈ బిడ్డెవడూ ! కన్నబిడ్డా ? కొన్నబిడ్డా ?"

"అవన్నీ నీ కనవసరం "

"అవున్లే కనే అవకాశం నీ మొగుడు నీ కెట్లాగూ ఇవ్వడని తెలిసీ కూడా అడగటం నాదే తప్పు, పాపా ! అయినా, 'పాపాయి కావాలి, మామా' అని నాకు కబురెడితే — డజన్లు, డజన్లు పంపేవాడ్ని కదా ?"

"ఎందుకొచ్చావో చెప్పకుండా ఏమిటీ గోల ?"

"మళ్ళీ మొదటికే వస్తున్నావ్, పాపా ! నేను ఎప్పుడొచ్చినా ఎందుకొస్తాను ? ఈ పానకాలుకి అసలే దాహం ఎక్కువ మామూలిచ్చేయ్ వెళ్ళిపోతాను "

"ఇప్పుడు నా దగ్గర్లేదు "

"పాపా! 'లేదూ—రాదూ—కాదూ' అనే శబ్దాలు నేను వినకూడదని మంగళగిరి పానకాలస్వామిమీద ఒట్టేసుకున్నాను—తెలుసు కదా ? నీకు కుబేరుడ్నిచ్చి పెళ్ళి చేసింది 'లేద'నే పదం వినడానిక్కాదు ... ఇచ్చేయ్, పాపా, వెళ్ళాలి "

"ఇవ్వకపోతే ఏం చేస్తావ్ ?"

"ఇప్పుడే చూపిస్తాను, పాపా !" విషపు నవ్వుతో పానకాలు మెళ్ళోని లాకెట్ తీశాడు. కళ్ళు కద్దుకున్నాడు బటన్ నొక్కాడు

అంతే. తులసి అమాంతంగా కొయ్యబారి పోయింది

గిడుతూరి సూర్యం దర్శకత్వంలో బి. పి రాయ్ నిర్మించిన బిందూ మూవీస్ "అమృత కలశం" చిత్రానికి ఆదివిష్ణు రచయిత, రమేష్‌నాయుడు సంగీత దర్శకుడు

### మొగుడు కావాలిలో తాగుడుకు నీళ్ళు కావాలి

శాంతి (సువర్ణ) రేడియో ట్యూన్ చేస్తూ ఉంది. 'లలలా లలలా' అంటూ లోపలికి వచ్చాడు సుందరం (మాతన్‌ప్రసాద్)

"ఎవరూ ?"

"ఎవరూ — ఏమిటే ? నేను సుందరం — అని పిలువబడే సుందరుడైన నీ మొగుడ్ని, ఈ ఇంట్లోకి దర్జాగా, ధీమాగా ఎప్పుడైనా వచ్చే అధికారం ఉన్న మగాడ్ని "

"నాలుగు రోజులుగా ఇంటికి రాలేదు ఏమయ్యారు ? ఎక్కడికెళ్ళారు ?"

"ఇదే ఇల్లాళ్ళు అని పిలువబడే ఆడాళ్ళతో వచ్చిన గొడవ మొగుడు రాగానే ప్రేమగా పలకరించటం ఉండదు — ప్రశ్నలు కురిపించడం తప్ప. వీళ్ళని పెళ్ళాలనడం కంటే పోలీసోళ్ళు అనడం కరెక్ట్. గ్లాసూ, నీళ్ళూ పట్టుకురా !"

"ముందు నేనడిగినదానికి జవాబు చెప్పండి ఇన్ని రోజులు ఎక్కడ తిరిగారు ? దేనితో తిరిగారు ?"

"ఒసే, వైఫూ ! చిన్నప్పుడు మా అమ్మా నాన్నా ప్రశ్నలడిగితే నేను జవాబులు చెప్పలేదు. చదివే రోజుల్లో పరీక్ష పేపర్లో ప్రశ్నలకి జవాబు చెప్పలేదు ఉద్యోగం ఇంటర్‌వ్యూకి వెళ్ళినప్పుడూ వాళ్ళ ప్రశ్నలకు జవాబులు చెప్పలేదు రేపు ఏ పార్టీకో నాయకుడ్నయి, మినిష్టర్‌నయితే — ఎగస్ పార్టీ వాళ్ళు ఏవైనా ప్రశ్నలు వేసినా — జవాబు చెప్పను. అలాటి నేను — అఫ్ట్రాల్ నీ ప్రశ్నలకి జవాబిస్తానా ? వైఫూ ! ఒక గ్లాసు నీళ్ళు పట్రా !" అంటూ పక్క జేబులోంచి బ్రాందీ సీసా తీశాడు సుందరం

"ఏమండీ, రోజుల తరబడి ఇంటికి రాకుండా అడ్డమైన దానితోనూ ఇలా తిరగడం మానేయండి "

"రాకరాక ఇంటికొస్తే, ప్రశ్నలు వేయటమూ— పాఠాలు చెప్పటమూ . నేనేం నిక్కరేసుకు స్కూలు కొచ్చిన కుర్రాడ్ని అనుకున్నావా ? ఛీ — ఛీ ! అందుకే సాధారణంగా రాను. ఇదే పంకజం ఇంటికి గాని, పాపమ్మ కొంపకి గాని వెళ్తే, ఇలా పీడించరు వైఫూ ! ఒక గ్లాసు నీళ్ళు పట్రా !"

"మీ బిడ్డలకు తల్లి కావలసిన ఇల్లాలిని బజారు వాళ్ళతో పోల్చటానికి సిగ్గులేదూ ? మీ దారిన మీరు ఇంటిని, పెళ్ళాన్ని మరచిపోయి తిరిగే వారయితే, నన్నెందుకు కట్టుకున్నారు ?"

"ఒసేయ్! బట్టలు ఎందుకు కట్టుకుంటాం ? నలుగురిలో తిరిగే మర్యాద కోసం భార్యగా నిన్ను కట్టుకున్నది కూడా ఆ మర్యాద కోసమే అర్థమైందా ? గొడవ పెట్టి మనశ్శాంతి పోగొట్టేశావ్ బ్రాందీ తాగటానికి గ్లాసూ, నీళ్ళూ లేని నువ్వు భార్యవా ? ఛా ! ఛా !" అంటూ దారికి అడ్డంగా నిలుచున్న భార్యను ఒక్కతోపు తోసి, సుందరం వెళ్ళిపోయాడు

కట్టా సుబ్బారావు దర్శకత్వంలో తమ్మారెడ్డి వి కె, నిర్మించే చరిత చిత్ర వారి "మొగుడు కావాలి" చిత్రానికి సత్యానంద్, జె వి రాఘవులు, వేటూరి, చెంగయ్య, ఆదుర్తి హరనాథ్ తెరవెనుక కృషి చేశారు.

'స్వర్గం'లో జి.వి.జి., జయసుధ



శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించు

అన్నపూర్ణా స్టూడియోస్

# పిల్లజమీందార్

ఈస్ట్మన్ కలర్

దర్శకత్వం సింగీతం శ్రీనివాసరావు

నిర్మాతలు వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని





సంగీతం: చక్రవర్తి.



అన్నపూర్ణా ఫిలింస్

Nandi

JAGAPATHI

సినిమా



'ప్రేమ సింహాసనం'లో రతి

# ఎన్. టి. ఆర్., చలనచిత్ర జీవితంలో నూతనాధ్యాయం!

"1981 డిసెంబర్ వరకే చిత్రాలకు కాల్‌షీట్లు ఇచ్చాను. 1982 మే 28న అరవ పడిలో అడుగెట్టబోతున్నాను. షష్టిపూర్తి ప్రసక్తే లేదు సన్మానాలను అసలు అంగీకరించను 1982 నుండి కొన్ని పవిత్రమైన నిర్ణయాలు తీసుకోదలిచాను. సంసార ఐహిక బంధాలకు దూరంగా ఉంటూ — నా శేష జీవితంలో సమాజాన్ని, నా పాత్రలతో ప్రేక్షకులను ప్రభావితుల్ని చేయాలని నా ఆకాంక్ష ఇంతవరకు ఏటికి ఎదురీదే ఉద్దేశ్యం లేక — కాలాన్నిబట్టే మనమూ వెళ్లాలన్న దృష్టిలో, ఏ రూపంలో నన్ను నా అభిమానులు ఆకాంక్షిస్తూ వచ్చారో — అలాంటి పాత్రల ద్వారా వారిని సంతృప్తి పరచడం వల్లే నిర్మాతలకు లాభదాయకంగా ఉంటుందన్న భావంతో అలాగే అనుసరిస్తూ వచ్చాను. నాలోని భగవంతుని ప్రేరణవల్ల శేష జీవితాన్ని ఆధ్యాత్మిక చింతనతో గడుపుతూ, వాణిజ్య సూత్రాలకు కట్టుబడకుండా మహాదాశయంతో, చైతన్యం కలిగించే మహాపురుషుల, మహనీయుల జీవిత చరిత్రలను తెరకెక్కించదలిచాను క్షుద్రమైన, తాత్కాలిక ఆకర్షణలకు అలవాటుపడ్డ యువతరానికి ఆవేశంతోపాటు జాతిని జాగృతమొనర్చే అత్యున్నత ప్రమాణాలు గల చిత్రాలను ఎన్. టి. ఆర్., సినీ క్రియేషన్స్ పతాకంలో సమర్పిస్తాను మన విప్లవ వీరుడు అల్లూరి సీతారామరాజు గురించి నే నేనాడో కూలంకషంగా పరిశోధించి స్క్రిప్టును సిద్ధంచేసి ఉంచిన విషయం మీ అందరికీ తెలుసు. ఆ స్వాతంత్ర్యయోధుని చరిత్రను తెరకెక్కించాలన్న నా చిరకాల వాంఛ ఈడేరబోతున్నది. అలాగే కాలజ్ఞాన తత్వాలతో లోకాన్ని ప్రభావితం చేసిన పోతులూరి వీరబ్రహ్మంగారి చరిత్రను కూడా తెరకెక్కించబోతున్నాను. ఇంతవరకు ప్రజలను రంజింపచేస్తూ వచ్చిన నేను ఇటువంటి సామాజిక, సాంస్కృతిక వికాసానికి తోడ్పడే ఉన్నత ప్రమాణాలు గల చిత్రాలనే పవిత్రమైన ఆశయంతో సమర్పిస్తాను," అన్నారు ఎన్ టి ఆర్ "ఎదురులేని మనిషి, యమగోల" వంటి ఆయన నటించిన చిత్రాలను ఆనాడు ఎంతగా అభినందించి, ఆదరించారో — అంతకన్నా రెట్టింపుగా ఆయన మహదాశయాలతో నిర్మించే చిత్రాలను ఆ ప్రేక్షకులే ఆదరించడం తథ్యం అప్పటికి ప్రేక్షకుల అభిరుచులు క్రమక్రమంగా మారిపోతుంటాయి

## కొత్త డబ్బింగ్ థియేటర్

మద్రాసులో 'విజయకృష్ణ' కాంప్లెక్స్‌లోని డబ్బింగ్ — ప్రివ్యూ థియేటర్‌కు ఆగస్టు 30న ప్రారంభోత్సవం జరిగింది ఎన్ టి ఆర్ ప్రొజెక్టర్‌ను స్విచ్ ఆన్ చేయగా, శివాజీగణేశన్ వెండితెరను ఆవిష్కరించారు

## గోపాలరావుగారి అమ్మాయిలో గోపాలరావు దంపతుల గొడవలు

"మగాళ్ళని డైలాగ్స్‌తో కొడతాం లేడీస్‌ని ఐక్స్‌లో కొడతాం అది మన స్పెషాలిటీ," అంటూ సదా గొప్పలు చెప్పుకునే గోపాలరావు ఇంట్లో బర్త్‌డే పార్టీ జరిగింది పార్టీ తర్వాత అందరూ వెళ్లిపోయారు - (రావు) గోపాలరావు, (షావుకారు) జానకి మిగిలారు "ఏమోయ్, పార్టీ బాగా జరిగినట్టేనా?" తీవిగా అడిగాడు గోపాలరావు

"మీకు కావాల్సిన వాళ్ళంతా వచ్చారుగా? బాగా జరిగినట్టే లెక్క," అంది జానకి

"ఏమిటా ఎత్తిపొడుపు?"

"ఎత్తిపొడుపేముంది? పడుచుపిల్లలంతా వచ్చి మిమ్మల్ని చూసి పరవశించిపోయారుగా?"

"కుర్ర వెధవలంతా వచ్చి, నిన్ను చూసి చిందులేశారుగా? బొకే బాబులు — పిలవగానే పువ్వు పువ్వుకు మరీ వచ్చేశారుగా ఉత్సాహంగా?"

"మైసెస్టు పిల్లలు మీరు పిలవగానే ఉత్సాహంగా వచ్చేశారుగా?"

"ఏమిటోయ్? ఏమిటి? ఏమిటవలు?"

"ఇదిగో — ఏమీ తెలియనట్టు అనవసరంగా నన్ను రెచ్చగొట్టకండి ఎప్పుడో నేను ఏదో ఒకటి అనాల్సివస్తుంది," అంటూ జానకి విసురుగా, వెళ్లిపోయింది

"ఆఁ తన వెకిలిచేష్టలు నేనెక్కడ కనిపెట్టేస్తానోనని ముందుగానే నాలుగు మాటలనేయడం ఇదొక టెక్నిక్కు.. చెబుతా — చెబుతా!" అంటూ తలపంకించాడు గోపాలరావు

"గోపాలరావుగారి అమ్మాయి"గా నటించే జయసుధ సరసన చంద్రమోహన్ హీరో నాగభూషణం, మోహన్‌బాబు, సారథి, కాకరాల, చక్రవర్తి, కూన్ని ఇతర పాత్రధారులు ఆదుర్తి నరసింహమూర్తి కథకు సత్యానంద్ సంభాషణల కర్త, చక్రవర్తి సంగీతం, ఎస్ గోపాలరెడ్డి ఛాయ, నాయని మహేశ్వరరావు కూర్పు, తోట హేమచందర్ శిల్పం, శరత్ సహకార దర్శకత్వం, పుయ్యూరు రామకృష్ణ నిర్వహణలో కె సి శేఖర్ బాబు సమర్పణలో ఎ సారథి నిర్మించే నాగార్జున పిక్చర్స్‌వారి ఈ చిత్రం సెప్టెంబర్ 18న విడుదలవుతుందని డైరెక్టర్ కె వాసు చెప్పారు

## ఊటీలో సర్దార్ పాపారాయుడు

ఊటీలో 15–10 డిగ్రీల గరిష్ట – కనిష్ట ఉష్ణోగ్రతలు. ఎముకలు కొరికే చలి ... మరో వంక తుషారం. అంతటి అతి శీతల వాతావరణాన్ని పట్టించుకోకుండా ఎన్. టి. ఆర్, శ్రీదేవితో కలిసి ఊటీకి 21 కిలోమీటర్ల దూరంలో ఉన్న పైకారా జలపాతం వద్ద ఉషారుగా స్టెప్స్ వేస్తూంటే, డైరెక్టర్ దాసరి "అబ్బ! ఏ మాటకా మాటే చెప్పుకోవాలి నిజంగా మన ఇండస్ట్రీలో రామారావు, నాగేశ్వరరావుగార్లు వారికి వారే సాటి. చూడండి – ఇక్కడి దుర్భరమైన శీతల వాతావరణం ఆ మహా నటునిపై ఏ మాత్రమైనా ప్రభావం చూప గలిగిందా?" అన్నారు, ఆ ఔట్‌డోర్ షూటింగ్‌కు నిర్మాత క్రాంతికుమార్ ఆహ్వానించిన పాత్రికేయులతో.

"తెల్లచీర – కళ్ళ కాటుక
ఎర్రబొట్టు పెట్టుకొని వచ్చింది కృష్ణమ్మా!
ఏదో కబురు పట్టుకొచ్చింది కృష్ణమ్మా!
ఆ పరుగేమిటమ్మా? ఈ పరుగెందుకమ్మా!"

స్పీకర్‌లోంచి చక్రవర్తి సంగీతంలో బాలు, సుశీలలు పాడిన దాసరి గీతం గిలిగింతలు పెడుతోంది. తుంపర్లు ఎక్కువయ్యాయి. "సూర్య భగవానుని కటాక్షం లేకపోయినా మేము షాట్‌కు రెడీ!" అన్నారు ఛాయాగ్రాహకుడు ఎస్. వెంకటరత్నం





'సర్దార్ పాపారాయుడు'లో ఎన్. టి. ఆర్

ఎగుడు దిగుడుగా ఉన్న ప్రదేశంలో ట్రాలీ వేయిస్తూ "నేనూ రెడీ!" అన్నారు నృత్య దర్శకుడు సలీమ్.

"1980 వరకు ఇట్లాంటి ఒక పిల్ల – నా
కంటపడలేదు. పడినా – నే వెంటపడలేదు
ఓ బంగారక్కా! చూసే శృంగారక్కా!"

బోట్ క్లబ్‌నుంచి బొటానికల్ గార్డెన్‌కు యూనిట్ మారింది. అత్యుత్సాహంతో ఉన్న అందరి మీదా పన్నీటి జల్లులు కురుస్తూనే ఉన్నాయి ... యూనిట్‌లోని అందరికీ ప్రమోద్‌కుమార్, కోటేశ్వరరావు, మల్లి చక్కని ఏర్పాట్లుచేస్తూంటే– అన్నపూర్ణ సినీ ఎంటర్‌ప్రైసెస్ వారి ఈ భారీ చిత్రం బహు జనరంజకంగా తయారవడానికి నిర్మాత క్రాంతికుమార్ అధిక వ్యయప్రయాసలకోర్చి ఎంత కృషి చేస్తున్నారో ద్యోతకమైంది. "దాసరిగారు ఈ చిత్రంలో మరింత విజృంభించారు 7 నుంచి 9 వరకు మద్రాసులో ఇన్‌డోర్ షూటింగ్‌తో పిక్చర్ ఫినిష్ అవుతుంది విజయదశమికి విడుదల చేయాలనుకుంటున్నాం," అన్నారాయన. "ఈ చిత్రంలో నేను ధరించిన రెండు పాత్రలూ నాలోని ఆర్టిస్ట్‌కు పూర్ణ సంతృప్తినిచ్చే పాత్రలు," అన్నారు ఎన్. టి. ఆర్. ద్విగుణీకృతోత్సాహంతో



'శ్రీవారి ముచ్చట్లు'లో
అక్కినేని, జయప్రద

## ప్రభు చిత్ర తొలి షెడ్యూల్

"ప్రేమ తరంగాలు" చిత్రం విడుదలకు ముందే ఎస్. పి. చిట్టిబాబు దర్శకత్వంలో ఎం. వి. ఎస్. రాయపరాజు ప్రారంభించిన ద్వితీయ చిత్రానికి సెప్టెంబర్ 1 నుంచి 15 వరకు ఊటీలో తొలి షెడ్యూల్ జరిగింది. చంద్రమోహన్, రాధిక, చిరంజీవి, స్వప్న, పి జె శర్మ, జి ఎస్ స్వామి, కె. వి. చలం, భీమరాజు, శివకుమార్ పాల్గొన్నారు. ఆత్రేయ మాటలు, చక్రవర్తి స్వరకల్పనలో సి. నారాయణరెడ్డి, ఆత్రేయ, వేటూరి గీతాలు రాశారు విలియమ్స్ ఛాయాగ్రాహకుడు నిర్వాహణ సత్యనారాయణ, సూర్యనారాయణ.

## డి. వి. ఎస్. ప్రొడక్షన్స్

"ఒరుకై ఓసై" తమిళ చిత్రం ఆధారంగా తయారయ్యే చిత్రంలో చంద్రమోహన్, సుజాత ప్రధాన పాత్రధారులు. "డిసెంబర్, జనవరి నెలల్లో షూటింగ్ జరుగుతుంది," అన్నారు నిర్మాత డి. వి. ఎస్. రాజు



బాబూ ఆర్ట్స్ వారి చిత్రంలో
శ్రీదేవి, శోభన్

## పెట్‌లో సంగీతకు, జి. నిర్మలకు ఫైటింగ్

"నేనూ డిష్యుం డిష్యుం చేశానయ్యోవ్ ! అలా చూస్తావేమిటయ్యా ? ఏ సినిమాలో అని అడగవేం ?" అంది జి. నిర్మల. నేను అడక్కుండానే కాస్సేపట్లో ఆమే చెప్తుందని నాకు తెలుసు. అందుకే అడగలేదు; ఆమె చెప్పకుండామా ఉండలేదు. దేవర్ ఫిలిమ్స్ "బంగారు లక్ష్మి"లో సంగీతతో ఆమె చేసిన ఫైట్ ఓ ప్రత్యేక ఆకర్షణ అట. లక్ష్మి (జయసుధ), తన భర్త రాజా (చంద్రమోహన్)కు విధివశాత్తు దూరమయ్యాక పువ్వులమ్ముకొని బతికే నిర్మల ఇంట్లో ఉంటూ, తన భర్తను తిరిగి కలుసుకునే శుభ ఘడియ కోసం ఆత్రుతతో ఎదురుచూస్తుంటుంది లక్ష్మి మిడున్న అక్కసుతో ఉష (సంగీత) కుట్రపన్ని, లక్ష్మిని ఓ పాడుపడ్డ ఇంట్లో బంధిస్తుంది ఈ విషయం తెలిసిన వెంటనే ఆ రహస్య ప్రదేశానికి పరుగున వెళ్తుంటుందట నిర్మల అక్కడే ఆమెకూ, సంగీతకూ ఫైటింగ్ "ఈ వయస్సులోనూ డూప్ లేకుండా ఫైటింగ్ చేశానయ్యా హైలైట్, గిలైట్ – అంటూ ఏమిటో రాస్తారే మీ పత్రికల వాళ్ళు – అలా ఉంటుంది ఈ సినిమాలో నా ఫైటింగ్ అని రాయండి నా ఫాన్స్ సంతోషిస్తారు. నవ్వుతావేమిటయ్యా ? అభిమాన సంఘాలు లేకపోయినా నాకూ బోల్డుమంది ఫాన్స్ ఉన్నారయ్యా దేశంమీద – ఏమిటనుకుంటున్నావ్ !" అందామె బుగ్గలు సొట్టలుపడేలా నవ్వుతూ.. ఆ సన్నివేశాలను డైరెక్టర్ ఆర్ త్యాగరాజన్ బలే తమాషాగా చిత్రీకరించినట్లూ, "బంగారులక్ష్మి" చిత్రం మరొక "పొట్టేలు పున్నమ్మ"లా సంచలనం కలిగిస్తుందని చెప్పారు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్న చిత్తూరు ఆనందనాయుడు దండాయుధపాణి నిర్మించే ఈ చిత్రానికి నిర్మాణత గుత్తా రాధాకృష్ణ.

## సెన్సార్ చేయబడిన చిత్రాలు

ఈ సంవత్సరారంభం నుంచి ఆగస్ట్ 22 వరకు సెన్సార్ చేయబడిన చిత్రాల సంఖ్య

| నెలలు | తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం |
|---|---|---|---|---|
| జనవరి | 11 | 15 | 3 | 6 |
| ఫిబ్రవరి | 14 | 10 | 7 | 8 |
| మార్చి | 19 | 15 | 3 | 9 |
| ఏప్రిల్ | 10 | 8 | 7 | 9 |
| మే | 11 | 10 | 6 | 6 |
| జూన్ | 14 | 11 | 3 | 5 |
| జూలై | 14 | 13 | 8 | 9 |
| ఆగస్టు | 6 | 7 | 4 | 7 |
| | 99 | 89 | 41 | 59 |

ఎనిమిది నెలల్లో 99 తెలుగు చిత్రాలు సెన్సార్ చేయబడ్డాయి. అంటే, హాలివుడ్ను మించిన రికార్డ్ !




కూరగాయల సంచి ఇల్లాలి చేతికిచ్చి, గోడవారగా సైకిల్ ఉంచి, ఏదో బాధను ఉపశమింప చేసుకొన్నట్టుగా నిట్టూర్చాడు మార్కండేయరావు. భార్య శాంతమ్మ భర్త ముఖం ఓ క్షణం పరిశీలించి వంట గదిలోనికి దారితీసింది. వంకాయలు పుచ్చులనీ, బెండకాయలు ముదురనీ, దుంపలు మచ్చలనీ భర్తమీదకు దండయాత్రకు ఇంకోసారి రావచ్చుగదా అనే ధీమాతో ఆమె నిష్క్రమించిన తర్వాత మార్కండేయరావు నెమ్మదిగా ఇంట్లోకి వచ్చి బల్లముందు కూర్చొని ప్రొద్దున నుంచీ చూడని పేపరు తిరగేస్తున్నాడు.

— రైలుబండి గూడ్సుబండితో ఢీ కొనగా తొమ్మిదిమంది దుర్మరణం!

— లారీ క్రిందపడి ఒక యువకుని చావు!

— హోటల్ వర్కర్ దారుణమైన హత్య!

— ప్రకాశం! నువ్వు మరణించినా, నీ ఆత్మ మాలోనే ఉంది. నీవు లేనిలోటు మా హృదయ మందిరాల్లో నిరంతరం నీడలా వెన్నాడుతోంది.

ఇట్లు
కుటుంబ సభ్యులు.

ఈ వార్తలు చదివి మార్కండేయరావు పాలోచనగా కన్నులు మూసుకొన్నాడు. 'అబ్బా! ఎక్కడ చూసినా చావు! చావు! చావు! ఏ వంక ఒదిగినా, ఏ దిక్కు నక్కినా బ్రదుకుతున్న బ్రతుకు, చావుకు సావాసమైపోతున్నది క్రీనీడలా! ఇది భగవంతుని చిద్విలాసం కాబోలు!' అని అంతర్ముఖుడయ్యాడు.

అంతలో — వంట గదిలోనుండి శాంతంగా విచ్చేసిన శాంతమ్మ సంధించిన ప్రశ్న పారించింది.

'వంకాయలు ఎంతకిచ్చారు?'

'ఏం... కిలో... రెండు రూపాయలు!'

'బెండకాయలో?'

'అవీ... అంతే ధర!'

'బంగాళాదుంపలు?'

'ముచ్చటగా మూడు రూపాయలు.'

'అమ్మో! ఎందుకంత ఖరీదు?'

'దొరుకుతున్నందుకు సంతోషించమంటున్నారు!'

'లేకపోతే ఛస్తామా?'

'ఛస్తే సమస్యలూ, ప్రశ్నలు ఉండవ్.'

ఒక్క క్షణం శాంతమ్మ మాట్లాడలేదు.

'సరేగాని... అరడజను బత్తాయిపండ్లు ఎంతకు కొన్నారేమిటి?'

'బత్తాయిపండ్లు చూశావా? బాగున్నాయి గదూ! ఎక్కడివనుకొన్నావు? దోసకాయల పళ్లేవి! పంచదారకన్నా తియ్యనంట! అరడజన్ రూపాయిన్నరే!' అని భార్య ముఖంలోని భావాల కోసం చూశాడు.

'అమ్మో!... ముష్టి ఆరు పండ్లు... ఆ వెధవ బత్తాయిలు రూపాయన్నరా? ఇంటికొచ్చి, కాళ్ళమీదే సైకిల్‌వాళ్ళు డజన్ రూపాయికే పారేసిపోతున్నారు గదండీ... సెలవు పెట్టి మీరు చేసిన నిర్వాకం ఇదన్నమాట! అందుకే మీకు బేరం ఏమీ చేతకాదని నెత్తి నోరు బాదుకొంటూనే ఉన్నా. కూరగాయలు ఏదో అనుకొంటే బత్తాయిపండ్లకు డబ్బు తగలేశారు గదండీ...' శాంతమ్మ వాక్ ప్రవాహం అవిరళంగా సాగుతుంటే మార్కండేయరావు పెదవులమీద నవ్వుకొని, భార్యతో అన్నాడు —

'శాంతా! పిల్లలు బడికి వెళ్లారుగదూ! ఓ ఐదు నిముషాలు ఈ కుర్చీమీద కూర్చో. ఒక చిన్న కథ చెబుతా. బోరుకొట్టనులే. ప్లీజ్ కూర్చో.'

'బాబూ! మీ కథలు, గాధలు నాకొద్దు... నా కోసం బోల్డు పని కాచుకొని వుంది. అదుగో ముఖం అలా పెట్టేశారు... కూర్చుంటాలెండి... తొందరగా చెప్పండి' అని కూర్చున్నది.

## చూపుల జోలె చాపి...

దైన్యం తప్ప
మరే ఆచ్ఛాదనా లేక
తాటిచెట్టులా నగ్నంగా
ఆమె — !

ఏనాటి క్షణకాలం మెరుపుకో
ఏనాటి నిర్భాగ్యతకో
ఉదాహరణగా
ఆమె — !!

మరో క్షణకాలంలో
తనకు చోటెక్కడోనని
శాశ్వతంగా
వెతకడానికెళ్ళబోయే
పసికందు నోట్లో

రక్తం కూడ రానివి కుడుపుతూ
ఆమె — !!!

ఏడంతస్తుల రెస్టారెంట్ ముందు
"ఈ దేశమంటె నువ్వు కాదు
నే"నని
సవాలు విసుర్తున్నట్టు
ఆమె — !

'చూపుల జోలె' చాపి
ఈ దేశమిలా ఉన్నంతవరకు
అలానే శాశ్వతంగా
ఆమె — !!

— సుంకిరెడ్డి నారాయణరెడ్డి

'శాంతా! అంత ఔచిత్యం తెలియదా నాకు. పైపెచ్చు నువ్వే బాధపడతావు ఈ విషయం ఇప్పుడు చెప్పకపోతే. అయినా ఇది పగలనే సంగతి తెలియదనుకొన్నావా?'

'ఊఁ... తెలుసు... ఇందుకే కాబోలు సెలవు పెట్టింది?'

'అవును! ఈ కథ కోసమే సెలవు పెట్టానేమో! మరి చెప్పమంటావా? వద్దా?'

'సరే చెప్పండి' అన్నది అర్ధాంగి కూర్చొంటూ.

నేను బజారుకు బయలుదేరాను గదా! వెళ్తూ మధ్యదారిలో ఈశ్వరరావు ఇంటివైపు వెళ్ళాను. 'ఇంట్లో ఎవరూలేరు. కాలక్షేపంగా ఉంటుంది నేనూ వస్తా పద' అన్నాడు. ఇద్దరం బయలుదేరాం. చిన్న మార్కెట్లో ధరల కన్నా పెద్ద మార్కెట్లో ధరలు కొంచెం తక్కువగా ఉంటాయికదా అనుకొంటూ దూరమైనా అక్కడికే బయలుదేరాం.

కూరగాయల మార్కెట్టుకు వెళ్ళే గల్లి ఇరుకుగా, ఏటవాలుగా ఉంటుంది. పల్లంలో కూరగాయల మార్కెట్టన్నమాట! ఆ ప్రదేశం ఎంత రద్దీగా ఉంటుందో మాటల్లో చెప్పలేం. మనిషి తగలకుండా నడవడం కష్టమే! లారీలు వస్తుంటవి, వెళ్తుంటవి... ఒక ప్రక్క బత్తాయి బుట్టలతో సైకిళ్ళు... ఇంకో ప్రక్క కూరగాయల రాసులు... మధ్య ఇటూ అటూ తిరుగుతున్న బేరగాళ్ళు... వస్తూ పోతున్న మనుష్యులు... నుంచున్న లారీలలో నుండి చింతపండు బుట్టలు... ఉల్లిపాయల బస్తాలు, అరటి గెలలు దింపడానికి తొందర పడుతున్న కూలీలు... అంతా జన సమ్మర్దం.

ఈ జనప్రవాహాన్ని ఈదుకొంటూ కూరగాయల మార్కెట్టులోనికి వచ్చిపడ్డాం. ఇద్దరం కూరగాయలు కొన్నాం. వస్తూ మార్కెట్లో ఎడమచేతివైపుగా ఉన్న కొబ్బరికాయల కొట్టువద్ద కాయలు అడిగితే 'ముదురుకాయ రూపాయిన్నర; లేతకాయ రూపాయి పావలా' అన్నాడు.

# మమతల మూల్యం

'ఇచ్చే ధర చెప్పు' అంటే 'చెప్పేది ఇచ్చేది ఒక్కటే, ఇష్టముంటే కొనండి లేకపోతే పొండి' అన్నాడు నిష్కర్షగా. అంతలో ఆ కొట్టుముందర కొబ్బరికాయల లారీ ఆగింది. లారీ వెనకా ముందూ ఒంటెద్దు బండ్లు. ఎటూ దారి లేక ఆ కొట్టు ముందే నిలబడవలసివచ్చింది.

ఆ కొట్టువాడు మాత్రం ఏమాత్రం ఇంగిత జ్ఞానం లేకుండా 'ఏంటయ్యా కొట్టుకడ్డం... ఎల్లండెల్లండి... పొద్దున్నే బేరం చేశారు' అన్నాడు విసుగ్గా. నాకు ఒళ్ళు మండిపోయింది.

'అయ్యా! మేము నిలబడ్డంకోసం రాలేదు. ఇదుగో లారీ అడ్డం... ముందూ వెనకా బళ్ళు... ఎట్లా మేం చచ్చేది' అన్నాను.

'అది నాకు తెలవదు... నా కొట్టుముందు నుంచి మాత్రం వెళ్ళమంటున్నా. అంతే' అన్నాడా మూర్ఖుడు. అంటే ప్రాణం విలువ కొబ్బరికాయల ఖరీదుకన్నా తక్కువన్నమాట వాడి దృష్టిలో. తర్వాత ఏదో విధంగా తిప్పలుపడి, సైకిళ్ళతో అక్కడనుంచి బైటపడ్డాం. అప్పటికి కొంత జనం పలచబడింది.

ఇంతకుముందు జరిగిన సంగతి చెప్పడం మర్చిపోయాను. కూరగాయలకు వెళ్ళేముందర ఒక ముసలమ్మ దగ్గర బత్తాయిపండ్లు బేరం చేశాడు ఈశ్వరరావు. ఎవరిదగ్గరకొన్నావు? ఒక ముసలమ్మ దగ్గర. ఆమెకు అరవై సంవత్సరాలకు పైనే ఉండొచ్చు. చిరుగుల చీర కట్టుకొన్నది. చేతిలో కర్ర. అయితే బేరంలో మొండికట్టె. ఆ ముసలమ్మలో ఎంతమాత్రం బేరం చేసే లక్షణాలు లేవు. చెప్పిన మాటకంటే పైసా తగ్గించే తత్వం లేదు. అంత వయస్సులో ఆ తాపత్రయం ఎందుకో అర్థంకాదు.

'డజను బత్తాయిలు ఎంత?' అంటే —

'మూడు రూపాయలు' అన్నది.

'అంత ఖరీదా ముసలమ్మా' అంటే —

'అటె రకమే అంత. పసనదార (పంచదార) అక్కర్లేదు' అన్నది.

'సరేగాని ఇంకో మాట చెప్పు' అంటే —

'మీ డబ్బు మీ దగ్గరే ఉంది... నా పండ్లు నా దగ్గరే ఉన్నాయి. ఇంకో మాటలేదు' అన్నది.

కాల్చినా కాలదురా ఈ ముసలమ్మ అనుకొంటూ మేము కూరగాయలు కొనుక్కొని వస్తూ, మళ్ళా ముసలమ్మ కూర్చున్న స్థలం దగ్గరకువచ్చాం. ముసలమ్మ ప్రక్కన చింతకాయలు అమ్మేవాళ్ళు, ములక్కాడలు అమ్మేవాళ్ళు కూర్చున్నారు.

అప్పుడు ఆ ముసలమ్మ దగ్గర అరడజను పండ్లు మాత్రం ఉన్నాయి.

'ముసలమ్మా! ఇప్పుడైనా బేరం చెప్ప. ఎంతకిస్తావ్ అరడజన్' అన్నాడు ఈశ్వరరావు.

'ఇన్నాకే చెప్పాగదా బాబూ! అరడజను అమ్మేశాను గందా! పసనదార అక్కర్లేదు... సూసుకోండి... దోసకాయల పల్లికాయలు మరి' అన్నది.

అంతలో అక్కడున్న జనం హోలోమంటూ చెల్లా చెదరయ్యారు. అందరూ ప్రక్క ప్రక్కలకు ఒదిగిపోయారు. పిచ్చి పట్టిన కుక్కలాగా లారీ భయ్యమని మోత చేస్తూ స్పీడుగా వచ్చేస్తున్నది! ఈశ్వరరావు సైకిల్ నడుముకు ఆనించుకొని ముసలమ్మతో బేరం చేస్తున్నాడు గదూ, లారీని చూసి సర్దుకొనే అవకాశం లేకపోయింది. లారీ వచ్చేసింది ఉప్పెనలా... అప్పుడు ఆ ముసలమ్మ... ఒక్కక్షణంలో... కనురెప్పపాటులో 'అయ్యో! నా కొడకా! సచ్చిన లారీ వొచ్చే' అంటూ ఈశ్వరరావును పొత్తిళ్ళలో పసిపిల్లవాణ్ణి హత్తుకొన్నట్టుగా తన మీదకు లాక్కొన్నది. అతనితో పాటుగా సైకిల్ కూడా ముసలమ్మపై పడింది...

లారీ తుపాకీ గుండులాగా దూసుకొనిపోయింది.

ఒక్కక్షణం ఆలస్యం అయితే, ముసలమ్మ అమ్మలాగాఆదుకోకపోతే సైకిల్‌తోపాటు ఈశ్వరరావు నుగ్గు నుగ్గు అయ్యేవాడు. ఈ లోకంలో వాడికి నూకలు చెల్లిపోయి ఉండేవి. వాడి పెళ్ళాం, పిల్లలు అనాథలైపోయేవాళ్ళు. తర్వాత ఏమనుకొంటే ఏముంది? జనం వాడి అదృష్టాన్ని పొగిడారు. వాడి పెళ్ళాం పసుపుతాడు గట్టిదన్నారు. లారీ డ్రైవర్ని బండ బూతులు తిట్టారు. ముసలమ్మ చేసిన ఘనకార్యాన్ని మెచ్చుకొన్నారు. అప్పటికి పోలీసు బైటపడి దారి సరిగా చూసుకొని నడవాలి అని కర్తవ్యోపదేశం చేసి, ఆ లారీ కోసం వెళ్ళాడు.

ఈశ్వరరావు ముసలమ్మవైపు కృతజ్ఞతాపూర్వకంగా చూశాడు. ఇంకోమాట లేకుండా జేబులో ఉన్న రూపాయిన్నర యిచ్చి ఆ పండ్లు తీసుకొన్నాడు. అమృత ఫలాల్లా వాటిని సంచిలో భద్రంగా వేసుకొన్నాడు.

కొంతదూరం వచ్చాక 'నీకు ఇంట్లో ఎవరూ లేరు గదా ప్రస్తుతం. నేను తీసుకొంటాలే' అని రూపాయిన్నర ఇచ్చి వాటిని పుచ్చుకొన్నాను. ఇప్పుడు చెప్పాలి నువ్వు! ఈశ్వరరావు చేసింది సబబుగా ఉందా? ప్రాణం రక్షించినందుకు ప్రతిఫలం ఇవ్వకపోగా, రూపాయిన్నర మాత్రం ఇచ్చి చక్కా రావడం సమంజసమేనంటావా? ఆ క్షణపు అమూల్యమైన సహాయం ఖరీదు రూపాయిన్నరేనా?

# హావభావాలు ప్రకటించడానికి...

## ... ఆప్కో చేనేత వస్త్రాలు

మృదువుగా, మనోహరంగా ఉండే ఈ వస్త్రాలు ఉల్లాసాన్ని కల్గిస్తాయి. సిసలైన పట్టు, అద్భుతమైన కాటన్, పోలియస్టర్, జనత చీరలు, ధోవతలు అవే ఆప్కో వస్త్రాలు .... మీకు అందుబాటులో వున్న విభిన్న శ్రేణులు. మీరు చవిచూడదగిన చక్కటి అనుభూతి అదే మధురానుభూతి.




**ది ఆంధ్రప్రదేశ్ స్టేట్ హేండ్లూం వీవర్సు కోపరేటీవ్ సొసైటి లిమిటెడ్.**

నారాయణగూడ, హైదరాబాద్.

KIRON/APCO/8022

 **జాతర** 

జాతర జరుగుతున్నది
దేవుని పేరిట మనుషుల జాతర జరుగుతున్నది
ఆలయంలో భక్తులు గంటలమీద
సంతకాలు చేస్తున్నారు
పూజారి గజాల చేతులను
గంటసేపు నిలబెడుతున్నాడు
గడియారం చేతులను ఊరకే వదులుతున్నాడు
గుడిలోని దృశ్యాలను చూసి
టెంకాయలు తలలు పగులగొట్టుకొని
తెల్లబోతున్నాయి
అగరొత్తులు ఏడుస్తున్నాయి
దేవుడు రాయైపోయాడు

ఆలయం బయట జాతరలో
కత్తెరల దొడల క్రింద
జేబుల కుత్తుకలు తెగుతున్నాయి
జారే జాణల జరి పైటలతోపాటు
యువకుల గుండెలూ జారుతున్నాయి
తల్లుల కోసం పిల్లలు వెతుకుతున్నారు
బిడ్డల కోసం తండ్రులు వెతుకుతున్నారు
జారే మల్లెలు జారుతున్నాయి
నలిగే మల్లెలు నలుగుతున్నాయి
జాతర జరుగుతున్నది
నీతిని పాతర వేస్తున్నది

— కందాళై రాఘవాచార్య

ఆ ముసలమ్మ లేకపోతే ... వాడి పెళ్లాం ... ముగ్గురు పిల్లలు ... ఇంకా బంధువులు...ఈపాటికి నెత్తి, నోరు బాదుకొంటూ ఉండేవాళ్ళే గదా! కాబట్టే నువ్వు ఏదోలే అనుకొన్న ఆ పండ్ల వెనక అంత కథ ఉంది! ఇప్పుడు చెప్పు. నువ్వేమంటావో—అన్నాడు మార్కండేయరావు నిట్టూర్చి.

'అమ్మ బాబోయ్! అంత పని జరిగిందా?

## మమతల మూల్యం

నా గుండెలు కొట్టుకొన్నాయి కదండి ... ఆ పెద్ద మనిషి ముష్టి రూపాయిన్నర యిచ్చి టెంగు రంగామని రావడానికి సిగ్గు వేయలేదటండీ — ఆ ముసలమ్మకు ఎంతచేస్తే ఋణం తీరుతుంది? నిజంగా ఎంత ఘోరం జరిగిపోయింది ... మీరు మాత్రం ఆ ముదనష్టపు మార్కెట్టుకు వెళ్ళకండి బాబు' కన్నుల్లో నీళ్ళు తిరుగుతున్న శాంతమ్మ అన్నది.

'మరి ఇంతకు ముందు ఆ బత్తాయి పండ్లనే ముష్టి పండ్లన్నావు ... వెధవ పళ్ళన్నావు ... వాటి అసలు కథ విని వాటినే భూషిస్తున్నావ్; ప్రశంసిస్తున్నావ్ ... శాంతా! ఒకవేళ ఈశ్వరరావుకు జరిగింది ... నాకే జరిగితే ... నువ్వు ... ఏమైపోయే దానివో? ఇంకా ఏమనేదానివో!' అన్నాడు కన్నులలోకి చూస్తూ.

'ఏమిటి మీరంటున్నది? ఎందుకలా అంటున్నారు?' అన్నది శాంతమ్మ ఆదుర్దాగా.

'అవును శాంతా! ఈశ్వరరావు పాత్ర కేవలం కల్పన. ఈ సంఘటన జరిగింది నాకే! ఆ ముసలమ్మ నా ప్రాణ ప్రదాత ... నీ పసుపు కుంకుమలకు విధాత ... ఆ పళ్ళు వెలలేని అమృత ఫలాలు ...' మార్కండేయరావు గొంతు గద్గదికం అయ్యింది.

'అమ్మో! ఈరోజు ఎంత దారుణం జరిగింది!' అని మార్కండేయరావును గాఢంగా కౌగలించుకొన్నది వణికిపోతూ.

అసలైన విలువలు అర్థం చేసుకొని అమూల్యమైన వస్తువు దూరమైపోయేదన్న తపనతో కౌగలించుకొన్న ఆ కౌగిలిలో, ఇంతకు ముందు రక్షణ యిచ్చిన ముసలమ్మ వాత్సల్యపు కౌగిలింతలో అంతర్లీనమైన మూలతత్త్వం, ఆ క్షణంలో మార్కండేయరావుకు అవగతమైంది.

# బ్రూక్ బాండ్
# గ్రీన్ లేబిల్

## మంచి కాఫీకి సారవంతమైన రుచికి ఎల్లప్పుడూ నమ్మవచ్చును




గ్రీన్ లేబిల్ యొక్క రుచి మీరు దీనిని కొన్ని సంవత్సరంలుగా ఇష్టపడేలా చేసింది. సువాసన మరియు సంతృప్తి నిస్తుంది.

**మీ కుటుంబ సాంప్రదాయకంగా వచ్చున రుచి**

OBM.6306A TEL

(గత సంచిక తరువాయి)

22
















[ఇంకా ఉంది]

అమ్మా, మనబీరువాలలో కూడా
ఓడోనిల్ ఎందుకు
పెడుతున్నాం?













- కలరా ఉండలకన్న 30 రెట్లు శక్తివంతమైనది.
- ఇళ్ళల్లో, ముఖ్యంగా మరుగుదొడ్లలో గాలిని తాజాగా, దుర్వాసన లేకుండా చేస్తుంది.

CHAITRA-BLS-186 TEL

**10-10-1980 శుక్రవారం మొదలు**
**16-10-1980 గురువారం వరకు**

# వారఫలం

మేషం : రాశికి షష్ఠమంలో గురు, శనులు కన్యలో కుజుడు, మకరంలో కేతువు, రాహువు, సింహ రాశిలో ఉండటంచేత, మీకు వ్యాపార లాభమున్నది. ఇటీవల వ్యాపారంలో మీరు గావించిన మార్పులు సత్ఫలదాయకాలు. అధికంగా భావి కాలంలో లాభం, జయం, ప్రశాంతి పొందనున్నారు. మిత్ర, బంధు వర్గీయులతో, ఆలోచనలు జరుపుటకు అనుకూల వారం. స్త్రీలకు : చాల మందికి నూతనోద్యోగావకాశాలకు, ఉత్సాహానికి అనుకూల వారం.

వృషభం : గత కొన్ని వారాలుగా జరుగని కార్యాచరణ ఈ వారం సంభవం. ఆదాయాభివృద్ధి, అయివేజులో వృద్ధి, ఆటంకాలు సమసిపోవటం, అనుకున్న పనులు నెరవేరుట, అప్పులు అనుకూల సలహాలు చెప్పుటకు,అనుకోకుండా బంధువులు యిలు చేరటం, అధిక వ్యాపార విస్తరణకు అనుకూల వారం. స్త్రీలకు : మొదటి మూడు దినాలలో నెరవేరని కార్యాలుండవు. కళా రంగఖ్యాతి అతిశయింపగలదు ఆరోగ్య లోపం లేదు.

మిధునం : ఈ వారంలో అనుకోకుండా అనేక పనులు నెరవేరే అవకాశమున్నది. కళా రంగంలో, పత్రికా రంగంలో, వ్యవహార రంగంలో, వ్యాపార రంగంలో, వృత్తి ఉద్యోగాలలో మీకు అనుకూలత గలదు. శ్రమ అధికమైనా, అందుకు తగిన ఫలమున్నది. స్త్రీలకు : ఆట పాటల్లో ప్రవేశమున్న వారికి, చిత్ర కళా రంగంలో అభినివేశమున్నవారికి, ఆదాయం, అభివృద్ధి చెప్పదగిన వారం.

కర్కాటకం : ఈ వారంలో, మీరు వూహించని విధంగా, మీ జీవితానికి ఉపయోగకరమైన మార్పులు సంభవింపనున్నవి. సంతాన మూలకముగా ఆనందం అనుభవింపగలరు. ఉన్నత విద్యార్జనకు చాలా మందికి అవకాశాలుండగలవు. చాలా మందికి ప్రయాణాలు చెప్పదగిన వారం. మిత్ర సహాయ సంపదలుండగలవు. స్త్రీలకు : నగలు కొనటం, అపూర్వ వస్తుసేకరణ, కొందరకు ఉద్యోగంలో అభివృద్ధి చెప్పదగిన వారం.

సింహం : ఈ వారం నుండి మీకు కొంత కాలం వరకు ఆరోగ్య లోపం కనిపించదు. అంత మాత్రమేగాక, సర్వతో ముఖాభివృద్ధి కూడా సమకూడే అవకాశమున్నది. బంధువుల మూలాన, మిత్రుల మూలాన, వ్యాపారవిస్తరణ కార్యక్రమంలో అనుకూలత ఏర్పడగలదు. ఆర్థిక స్థిమితమునకు అనుకూల వారం. రావలసినడబ్బుకై ప్రయత్నించుట ఎంతైనా అవసరం. బంధువులతో సంబంధ బాంధవ్యాల పటిష్టతనందగలవు. స్త్రీలకు : వృత్తిలో వృద్ధి, విద్యా రంగంలో అభివృద్ధి, ఉద్యోగంలో హోదా హెచ్చగల వారం.

కన్య : మీకు, ఈవారంలో ప్రత్యక్షంగా అపకారం జరుగదు ! గాని, పెద్దగా అభివృద్ధి కనిపించదు. మీకుగాని, కుటుంబ సభ్యులకుగాని, అనారోగ్యత కనిపించగలదు. ఉద్యోగంలో అధిక శ్రద్ధ గైకొనుట న్యాయం. అశ్రద్ధ చూపితే అశక్తతకు దారి చూపుతుంది. స్త్రీలకు : వృత్తి ఉద్యోగాలలో స్థిమితం లేకపోవటంతో చికాకు ఏర్పడగలదు. స్వల్పాదాయం కూడా లేకపోలేదు.

తుల : ఆకస్మిక సంఘటనలు జీవిత రంగంలో పాడ సూపనున్నవి. మిత్రులు అనుకోకుండా శత్రువులుగా మారేఅవకాశమున్నది. బంధువర్గీయులలో రచరచలు బయలుదేరే అవకాశమున్నది. చాలా మంది తప్పనిసరిగా ప్రయాణాలు చేయగలరు, ప్రమాదాలకు గురి కాకుండా చూచుకోండి. స్త్రీలు నూతన వస్త్రాభరణాలు కొనగలరు. ఉద్యోగంలో అభివృద్ధికి పోగల అవకాశాలుండగలవు. కొందరకు క్రీడా రంగావకాశాలేర్పడగలవు.

వృశ్చికం : మీ కుటుంబంలో సంతోషాలుండగలవు.అధికాదాయాన్ని అందుకొనే అవకాశమున్నది. బిడ్డల అభివృద్ధిని చూచి మురిసిపోయే అవకాశాలుండగలవు. ఇంట శుభ కార్యములను గూర్చి ఆలోచనలుండగలవు. అయినా ఇంకా శుభ కార్యాచరణకు కాలం అనుకూలంగాదు. నూతన వస్తు సేకరణ చేయగలరు. స్త్రీలకు : నూతన నగలు కొనుటకు, గృహానందానికి, సంతాన మూలముగా సంతోషం కల్గుటకు అనుకూల వారం.

ధనుస్సు : మీకు రావలసినడబ్బు, సమయానికి చేతికందే అవకాశమున్నది. ఆరోగ్యభాగ్యానికి తోడు, భాగ్యం సమకూరే ఫలితాలకు అవకాశముండగలదు. వర్తకులకు అనేక విధాల అనుకూలం. ఒక వేళ వ్యాపార విస్తరణకు కూడా అవకాశముండగలదు. హటాత్తుగా బంధువులు యిల్లు చేరటం కూడా సంభవమే. స్త్రీలకు : ఉద్యోగంలో నూతనావకాశాలేర్పడ్డం, కొందరకు ఉన్నత పదవులకు అవకాశాలుండటం కూడా సంభవం.

మకరం : మీరు చేసే వ్యాపారంలోగాని, వృత్తిలోగాని, ఉద్యోగంలోగాని యిబ్బందులుండగలవు. వ్యాపారం చేసే వారికి, అధికారుల మూలాన యిబ్బంది కలగవచ్చును కూడా. కొందరు, ఉద్యోగ రీత్యా దూర ప్రాంతాలకు ప్రయాణం చేయవలసి రావచ్చు. స్త్రీలకు : వస్త్ర సేకరణకు, విలాస వస్తు సేకరకణకు అవకాశమున్నది. ఆటల్లో ప్రవేశమున్నవారికి, అనుకూలతకు, విజయ సిద్ధికి అనుకూలమే.

కుంభం : చలన చిత్ర వ్యాపారస్తులకు స్తంభించిన వ్యాపారం, మరలా కదలటానికి అవకాశమున్నది. తోటల మూలాన, దొడ్ల మూలాన చాలా మందికి, నూతనంగా లాభించే మార్గాలేర్పడగలవు. పెద్దల వలన జరుగవలసిన పనులు, మీ కృషిలోపం లేకపోతే చక్కగా నెరవేరుతాయి. స్త్రీలకు : ఈ రాశి వారికి, బంధువులతో, మిత్రులతో మాటపట్టింపులుండగలవు. ఆరోగ్యం కూడా లోపించగలదు.

మీనం : దూర బంధువులను గూర్చి, వారి క్షేమాన్ని కాంక్షించి, మీరు సహాయంచేయవలసి వస్తుంది. అనవసరమైన ఖర్చు కూడా తగిలే అవకాశమున్నది. వర్తకులకు, నటులకు, వైద్య వృత్తిలోనివారికి అనుకూల వారంగా చెప్పవచ్చు. స్త్రీలకు : విలాసవస్తు సేకరణయోగాక, ఏదో విధంగా కొంత ద్రవ్యాదాయం కూడా సమకూడే వారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# అవసరానికో రేడియో



**మల్లాది వెంకట కృష్ణమూర్తి**

సభాపతికి ఆ ట్రాన్సిస్టర్ రేడియో అంటే ప్రాణం. కారణం అది అతనింట్లోని అత్యంత విలువయిన వస్తువని కాదు. అలాంటిది మరొకటి దొరకని అరుదయినదని కూడా కాదు. తనకి నచ్చే హాబీ ద్వారా సంపాదించిన మొదటి వస్తువది.

సభాపతి నటుడు.

స్టేజ్‌మీద కాదు, రేడియోలో.

అతని కంఠం గంభీరంగా వుంటుంది. ఎవరో చెప్తే రేడియోలో ఆడిషన్ టెస్ట్‌కి వెళ్లాడు. దాంట్లో సభాపతిని విజయం వరించింది. సభాపతి పేరు, చిరునామా ఆలిండియా రేడియోలో నమోదులయ్యాయి.

తరచు వాళ్ళు ప్రసారంచేసే నాటకాల లోని పాత్రలని పోషించడానికి సభాపతికి కాంట్రాక్ట్ వస్తూంటుంది. అయిదారు నాటకాలలో ఆ విధంగా నటించాడు.

రేడియో స్టేషన్ వాళ్ళు ప్రతిఫలంగా ఇచ్చే చెక్కులని ఆబిడ్స్‌లోని ఓ మార్వాడి దగ్గర అర్ధరూపాయికి డిస్కౌంట్ ఇచ్చి కేష్ చేసుకునేవాడు, అతనికి బేంక్ ఎకౌంట్ లేకపోవటంతో.

ఆ డబ్బుని సభాపతి భార్య ఇంట్లో అవసరాలకి వాడకుండా పోపుల పెట్లో దాచేది. అయిదారు నాటకాలు ప్రసారంఅయేక రెండువందల నలభై దాకా పోగయ్యాయి ఆ విధంగా.

సెక్రటేరియట్‌లో గుమాస్తాగా పని చేస్తున్న సభాపతి జీతం బొటాబొటిగా సరి పోతుంది నెలంతా ఇల్లు గడవడానికి.

సభాపతి భార్య, తన భర్త రేడియో నాటికలకి తన గొంతు అరువిచ్చి సంపాదించిన డబ్బుతో ఓ రోజు అబిడ్స్‌కి వెళ్ళి ఓ రేడియో షాపులో ట్రాన్సిస్టర్ ఒకటి కొన్నది.

సభాపతి ఆఫీస్‌నించి ఇంటికి వచ్చాక దాన్ని చూసి ఆశ్చర్యపడ్డాడు. సంగతి తెలిసాక సంతోష పడ్డాడు. భార్య తెలివికి ప్రశంసించాడు.

సభాపతికి, అతని భార్యకి ఆ తర్వాత ఆ ట్రాన్సిస్టర్ ఇంట్లో చాలా విలువయిన ముఖ్య వస్తువు అయింది.

భర్త ఇంట్లో లేని సమయంలో కాల క్షేపానికి సభాపతి భార్యకి అది విలువయినది.

తను రేడియో స్టేషన్‌లో సంపాదించిన ఆ ట్రాన్సిస్టర్‌మీద సభాపతికి సెంటిమెంట్ విలువ ఏర్పడింది.

ఒక విధంగా అది వాళ్ళిద్దరినీ ఇంకా దగ్గర చేసింది.

రోజూ రాత్రి భోజనాలయ్యాక, లైటు ఆర్పేసి చీకటిలో ఆ ట్రాన్సిస్టర్ లోంచి వచ్చే పాటలని ఇద్దరూ నిశ్శబ్దంగా మంచం మీద పడుకుని వింటూండటం అలవాటుగా మారింది. ఆ నిశ్శబ్దం, చీకటి, పాటలు మానసికంగా ఇద్దరినీ దగ్గర చేసాయి. లేకపోతే ఆ సమయంలో సభాపతి పేపర్ లేదా పుస్తకాలు చదువుకునేవాడు. అతని భార్య పక్కింటి వాళ్ళతో కబుర్లు చెప్పడానికి వెళ్ళేది.

అలాంటి చరిత్రగల ఆ ట్రాన్సిస్టర్ రేడియో మాయమవడం ఆ దంపతులిద్దరికీ

# అవసరానికో రేడియో

తీరని లోపం అయింది.

అంత తేలికగా తనింట్లో దొంగతనం జరగడం సాధ్యం అని ఎన్నడూ అనుకోలేదు సభాపతి.

ఆ రోజు వుదయం వార్తలు విన్నాక వీధి తలుపు దగ్గరికి వేసి స్నానం చేయడానికి లోపలికి వెళ్ళాడు సభాపతి. వెళుతూ ట్రాన్సిష్టర్‌ని ఆర్పేసాడు.

వంటగది వెనకాలే.

అతని భార్య చాటలో బియ్యం పోసుకుని ఏరుతోంది. వీధి గుమ్మం దగ్గర పక్కింటి పిల్లలు ఆడుకుంటూనే వున్నారు.

పావుగంటలో స్నానం ముగించి, హేంగర్‌కి వేలాడుతున్న బట్టలు తొడుక్కున్నాడు.

మళ్ళీ ముందుగదిలోకి వచ్చాడు.

తను ఇందాక దగ్గరకి వేసిన ముందు గది తలుపులు బార్లా తెరచివుండటం వెంటనే గమనించలేదు సభాపతి. ట్రాన్సిష్టర్ కోసం చూస్తే లేదు.

వంటగదిలోకి వెళ్ళాడు భార్య తీసిందేమోనని. లేదు.

బెండకాయలు తరుగుతోంది.

"ట్రాన్సిష్టర్ ఏది?" అడిగాడు.

"నాకేం తెలుసు? మీరే వింటున్నారుగా!"

"స్నానానికి వెళుతా ఆపేసి వెళ్ళాను. ముందు గదిలో లేదే?"

ఇద్దరూ ఇల్లంతాచూసారు. కనబడలేదు.

పక్కింటివాళ్ళు అలా ఎప్పుడూ తీసుకెళ్ళపోయినా, వాళ్ళు తీసారేమోనని అడిగింది సభాపతి భార్య.

వాళ్ళూ తియ్యలేదు. ఏమైంది?

అర్థం కాలేదు భార్యాభర్తలిద్దరికీ.

దొంగతనం జరిగివుండాలని నిర్ధారణ చేసుకున్నారు. ఆఫీస్‌కి వెళ్ళబోతూ, ఆలోచనవచ్చి పొరబాటున బాత్‌రూంలోకి తీసుకెళ్ళాడేమోనని చూసాడు సభాపతి. అక్కడా లేదు.

ఆఫీస్‌కివెళుతూ పోలీస్‌స్టేషన్‌లో రిపోర్ట్ ఇచ్చాడు సభాపతి.

సబ్ ఇన్‌స్పెక్టర్ అడిగిన ప్రశ్నలకి సరయిన సమాధానాలు చెప్పలేకపోయాడు సభాపతి. ఆ దొంగ ఎవరో చూడలేదు. ఎవరూ చూడలేదు నిజానికి.

ఎలా పోయిందో, ఎవరు దొంగో కూడా అర్థం కాలేదు. దంపతులిద్దరూ బాధ పడ్డారు. మళ్లీ ట్రాన్సిష్టర్ కొనాలంటే చాలా నెలలు పడుతుంది. తను రేడియో స్టేషన్‌లో అనేక నాటకాలకి, రికార్డింగ్ రూంలో అరగంట నాటకానికి దాదాపు గంట స్వరసేవ పడ్డ అవస్థకి ప్రతిఫలంగా వచ్చిన ఆ వస్తువు పోవడం సభాపతిని బాగా బాధించింది.

ఎక్కువకాలం కాదు.

అయిదు వారాల తర్వాత సభాపతి పేరున ఓ రిజిష్టర్ కవరు వచ్చింది పోస్టులో. ఆఫీస్ నించి ఇంటికి వచ్చాక దాన్ని చింపి వుత్తరం బయటకి తీశాడు.

ఉత్తరానికి నూటఇరవై రూపాయలు — ఒక వందరూపాయల నోటు, ఒక ఇరవై రూపాయల నోటు గుండుసూదితో గుచ్చబడి వున్నాయి. ఆ నోట్లతోబాటు ఓ ఎర్రరంగు రసీదు కూడా గుచ్చబడి వుంది వుత్తరానికి.

ఆ లెటర్ ఇంగ్లీష్‌లో టైప్ చేయబడి వుంది. పంపిన వారి సంతకం లేదు.

"సభాపతి గారికి,

రసీదు, డబ్బు జత చేస్తున్నాను. నేను మీ ఇంట్లో దొంగిలించి తాకట్టు పెట్టిన మీ ట్రాన్సిస్టర్‌ని వెంటనే ఈ డబ్బు ఉపయోగించి విడిపించుకోండి. రసీదు మీద మార్వాడీ చిరునామా వుంది. వడ్డీతో సహా నూటఇరవై సరిపోతుంది.

అవసరం నాచేత ఆ పని చేయించింది. తప్పలేదు. మీకు కలిగించిన అసౌకర్యానికి మన్నించండి. మీలాంటి మధ్యతరగతి వాళ్ల ఇళ్లలో అరుదుగా అవసరానికి దొంగతనం చేసినా, తిరిగి ఈ విధంగా వాళ్ల వస్తువులవి వాళ్లకి ముట్టచెప్పటం నా కలవాటు. నిన్ననే ఓ ఇన్‌కంటాక్స్ ఆఫీసర్ ఇంట్లో ఇంపోర్టెడ్ కెమేరా దొంగిలించ గలిగాను!"

ఉత్తరం చదివి వంటగదిలోని భార్య దగ్గరికి పరిగెత్తాడు సభాపతి.

## ధర్మపథం　　పురాణాల విశిష్టత　　— బులుసు వేంకటరమణయ్య

మన ప్రాచీన వాఙ్మయంలో పురాణాలు ఒకభాగం. పురాణాలలో అష్టాదశ మహా పురాణాలు, ఉప పురాణాలు కూడా ఉన్నవి. వీటిపై ప్రాచీన సంప్రదాయానికి చెందిన వారికి ఆదరం వున్నా, నవీనులలో చాలా మందికి గౌరవ భావం లేదు. దానికి కారణం లేకపోలేదు.

పురాణాలు అన్నింటిలోనూ అయిదు అంశాలు తప్పకుండా వుంటాయి—

"సర్గశ్చ ప్రతి సర్గశ్చ
వంశో మన్వంతరాణి చ,
వంశాను చరితం చేతి
పురాణం పంచలక్షణమ్."

అనే సామాన్య లక్షణం ప్రకారం ప్రతి పురాణంలోను సృష్టిక్రమం, ప్రతి సృష్టి, వంశ వర్ణన, మన్వంతర విషయం, వంశాను వర్ణనం ఉంటాయి. ఒక పురాణం చదివిన తర్వాత మరొకటి చదివితే కొన్ని విషయాలు చర్విత చర్వణాలుగా కానవస్తాయి. కథలలో కూడా కొంత వ్యత్యాసం కానరావచ్చును. ఒకే పురాణంలో ఒక అధ్యాయంలో చెప్పిన విషయమే మళ్లీ మరొకచోట కొద్దిగానో, గొప్పగానో కానవస్తూ ఉంటుంది. విశ్వసించడానికి వీలుకాని అభూత సంఘటనలు కొన్ని కనబడుతూ ఉంటాయి.

పురాణాలపట్ల కొంత అనాదరణ కలగడానికి ఇట్టి కారణాలు సహకరిస్తాయి.

అయితే ఇక్కడ కొంత ఆలోచించవలసి ఉన్నది. మనకు ఎన్నో పద, వాక్య కోశాలు, విజ్ఞాన సర్వస్వాలు ఉన్నవి. నేటికవి ప్రత్యేకమైనవే! ఒకదానిలోఉన్న విషయమే ఇతరత్రా కూడా ఉంటుంది. దాన్నిబట్టి వాటి యెడల మనకు అనాదరణ కల్గుతున్నదా? లేదు. మన పురాణాలు కూడా— దేనికది ఒక విజ్ఞాన సర్వస్వం. ప్రతి పురాణంలోనూ వేద వేదాంగాలను గురించి, ఖగోళ, జ్యోతిష, వేదాంత, యోగ, ధర్మాది శాస్త్రాలను గురించి, భౌగోళిక విషయాలను గురించి ఎన్నో విషయాలు కానవస్తాయి.

పురాణాలలోని గాథలు కొన్నింటిలో అతిశయోక్తులు ఉండవచ్చును. చూచినదాన్ని ఇతరులకు చెప్పేటప్పుడు ఎక్కువగా చెప్పడం మానవులకు పరిపాటి. అట్టి అతిశయోక్తులు చెప్పే విషయానికి కొంత దృఢత్వాన్ని కలిగించడానికి ఉద్దేశించబడినవని మాత్రమే మనం గ్రహించాలి.

పురాణాలను ఒక పరిశీలన దృష్టితో చదివితే వాటినుంచి గ్రహించదగిన విషయాలు ఎన్నో దొరుకుతాయి. వాటిపైన అనాదరణ ఉంటే చదవాలనే బుద్ధి పుట్టదు. చదివితే గాని, అందులో ఏమున్నదో తెలియదు. పరిశీలించకుండా పురాణాల యెడల అనాదరణ చూపడం భావ్యం కాదు.

నేత్రదానం :

తమ దేహం మరణానంతరమూ సంఘానికి వినియోగపడాలనే సదుద్దేశం కల వారు అరుదుగా ఉంటారు. అలాటి అరుదైన కుటుంబం శ్రీ ఎం. ఎ. బసవలింగం మహాశయునిది. ఈ కుటుంబం తమ మరణానంతరం కళ్ళను, దేహాన్ని వైద్య పరిశోధనలకు దానం చేసింది. ఆయన చెల్లెలు, కూతురి దేహాలను వైద్య కళాశాలకు దానం చేశాడు. ఆయన మరణించగా, ఆయన కుటుంబం వారు ఆయన కళ్ళను సరోజినీ దేవి నేత్ర వైద్యశాలకు, దేహాన్ని మద్రాసు వైద్య కళాశాలకు దానం చేశారు. తమ దేహంతో ఇతరులకు మేలు కలుగగలదన్నప్పుడు, ప్రతి పౌరుడూ మరణానంతరం దానిని (దేహాన్ని) దానం చేయడానికి జంకరాదు.

బాలచిత్రకళా ప్రదర్శనం :

చిత్రలేఖనంలో గానీండి, సంగీత నృత్య నాటకాలలో గానీండి బాలబాలికలకు అపార నైపుణ్యం ఉంటుంది. వారు కనులు తెరచుకొనే కలలుగంటూ ఈ ప్రపంచాన్ని అపూర్వ మార్గంలో తిలకిస్తారు. నిజానికి మహా కళాకారుని లక్షణమే ఇది. ప్రతి శిశువూ ఒక నిగూఢ కళాకారుడు. పెద్దలు చేయవలసిందల్లా అదను చూచి తగు ప్రోత్సాహమివ్వడమే. శిశువులోని కళాకారుడు వ్యక్తమవుతాడు. ఈ దృష్టితోనే గోలకొండ కేంద్రీయ విద్యాలయం ఎనిమిదేళ్ళ క్రితం జాతీయ కేంద్రీయ విద్యాలయ బాలచిత్రకళా ప్రదర్శనాన్ని ప్రారంభించి కరికా ప్రాయులుగా ఉన్న బాల చిత్రకళాకారులను సంపూర్ణంగా వికసింపజేయడానికి ప్రయత్నిస్తున్నది. ఇది తొమ్మిదవ ప్రదర్శనం. ఆగస్టు 25 వ తేదీ నుండి 29 వరకు కళాభవన్‌లో జరిగింది. దేశం నాలుగంచుల నుంచి 58 కేంద్రీయ విద్యాలయాల నుంచి వచ్చిన 614 చిత్రాలు ఉన్నాయి ఈ ప్రదర్శనంలో. ఊరికే చూస్తేనే చాలు బాలబాలికలు తమ రచనలలో ఎంతటి గాంభీర్యాన్ని వైవిధ్యాన్ని వ్యక్తం చేయగలరో స్పష్టమవుతుంది. అస్సాంలో కల్లోల పరిస్థితి ఉన్నా ఈ ప్రదర్శనానికి ఆ ప్రాంతంనుంచి పెక్కు చిత్రాలు రావడం ప్రత్యేకంగా చెప్పదగిన విషయం. వివిధ సాంఘిక సాంస్కృతిక వైభవమున్న భారత భూమిని అమాయకులైన పసి పిల్లలు ఎలా చూచారో ఈ ప్రదర్శనం నిరూపిస్తుంది. ఈ ప్రదర్శనంలో 5—7 వయో వర్గంలో 19 మంది, 8—10 వయో వర్గంలో 26 మంది, 11—13 వయో వర్గంలో 23 మంది, 14—16 వయోవర్గంలో 18 మంది పతకాలు సంపాదించారు. 478 మంది యోగ్యతా పత్రాలు పొందారు. 5—7 వయో వర్గం చిత్రాలు ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించాయి. విద్యార్థులను విశేషంగా ప్రోత్సహించిన కోయంబత్తూరు, కాంప్టీ, ఉదయపూర్, మిస్సామరి, టెపోరోడ్ కేంద్రీయ విద్యాలయాల కళోపాధ్యాయులకు పతకాలు

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

ఇచ్చారు. ప్రదర్శనాన్ని ప్రారంభించిన రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామి తమ ప్రసంగంలో బాలబాలికలలో నిగూఢంగా వున్న కళా దృష్టిని బహిర్గతం చేయడానికి ఇలాటి ప్రదర్శనలు చాల అవసరమన్నారు. కర్నల్ ఎస్. ఆర్. భూషణ్ ప్రత్యేక సంచికను ఆవిష్కరిస్తూ కళాభిరుచి బాలబాలికలకు ఉత్తమ పౌరులనుగా తీర్చి దిద్ద గలదన్నారు. శ్రీమతి లక్ష్మి కుప్పుస్వామి విజేతలయిన విద్యార్థులకు పతకాలు, యోగ్యతా పత్రాలు బహూకరించారు.

నౌబత్ పహాడ్ వివాదం :

నగరంలోని నౌబత్‌పహాడ్ మీద పూర్వం ఒక మసీదు వుండేదని, దానిని ముస్లిం మతధర్మాదాయ శాఖ అయిన వక్ఫ్ బోర్డుకు స్వాధీనం చేయాలని శ్రీ జమాలుద్దీన్‌దర్వేశీ అనే వ్యక్తి పెట్టుకున్న దరఖాస్తును తొమ్మిదవ అసిస్టెంటు జడ్జి శ్రీ ఎస్. గణపతి ఆగస్టు 28న తోసివేశారు. నౌబత్‌పహాడ్ ప్రస్తుతం ప్రభుత్వం స్వాధీనంలో ఉంది. ఈ సంవత్సరం ఫిబ్రవరి నెలలో ఈ కొండపై ఎక్కువ పొనఃపున్యం గల రిపీటర్ స్టేషను ఏర్పాటయింది. దీనిపై గాంధీ విగ్రహాన్ని, వేమన సాంస్కృతిక కేంద్రాన్ని స్థాపించాలని రాష్ట్ర ప్రభుత్వం తలపెట్టింది. ఈ లోగా న్యాయస్థానంలో పిటిషను— నౌబత్‌పహాడ్ పై మసీదుండేది, దానిని మీర్జా ఇస్మాయిల్ కాలంలో పడగొట్టారు. అది వక్ఫ్ బోర్డు ఆస్తి. ప్రభుత్వం కూడా ఎలాటి కట్టడాలు నిర్మించరాదు అని. 1896 నాటి సాంవత్సరిక గ్రామం సర్వే రికార్డులను బట్టి నౌబత్‌పహాడ్ పై ఒక దేవాలయం వుండేదని, మసీదు మాటగానీ లేదని రాష్ట్ర ప్రభుత్వం రికార్డులు సాక్ష్యాధారాలు చూపిస్తూ వాదించు, పైన పేర్కొన్న తీర్పు జరిగింది.

మఖ్దూం అవార్డు :

రాష్ట్ర ఉర్దూ అకాడెమీ నెలకొల్పిన మఖ్దూం స్మృతి అవార్డును ప్రముఖ ఉర్దూ కవి, విమర్శకుడు శ్రీ అలీసర్దార్ జాఫ్రీకి ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి ఆగస్టు 15న అందజేశారు. అవార్డు విలువ పదివేల రూపాయలు. ప్రాచీన ఉర్దూ పరిశోధన నిమిత్తం మహారాష్ట్ర ఉర్దూ అకాడెమీకి లక్ష రూపాయల గ్రాంటును కూడా ముఖ్యమంత్రి మంజూరు చేశారు. ఈ సందర్భంలో ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ, కొన్ని రాష్ట్రాలలో ఉర్దూ వ్యతిరేక ప్రచారం జరుగుతున్నదని, అది చాల ప్రమాదకరమైనదని హెచ్చరించారు. ఉర్దూ ఏ వర్గం భాషా కాదని, భారతీయ భాషేనని, కులమత భేదం లేకుండా అంతా దీనిని మాట్లాడుతున్నారని ముఖ్యమంత్రి అన్నారు. ఉర్దూ అకాడెమీ అధ్యక్షుడు, పంచాయతీ





పుష్కరాల పుణ్యమాని మా మావ బాగానే సంపాయిస్తున్నాడు పిన్నీ

## హైదరాబాద్ నోట్ బుక్

శాఖమంత్రి శ్రీ బాగారెడ్డి ఈ అవార్డు ప్రదానోత్సవానికి అధ్యక్షత వహించారు. ఆస్థాన కవి డాక్టర్ దాశరధి కృష్ణమాచార్యులు, ఒరిస్సా మాజీగవర్నర్ శ్రీ అక్బర్ అలీఖాన్ మున్నగువారు ప్రసంగించారు.

ప్రకాశం ఛాయాచిత్ర ప్రదర్శనం :

పట్టుదలకు, ధైర్యసాహసాలకు మారో పేరైన టంగుటూరి ప్రకాశంపంతులు 109వ జన్మదినోత్సవం సందర్భంగా ప్రకాశం ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డెవలప్‌మెంట్ స్టడీస్, ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్టు యూనియన్, రాష్ట్ర ప్రభుత్వ సమాచార శాఖ సమిష్టిగా ప్రెస్ క్లబ్‌లో ఏర్పాటుచేసిన సభలో రాష్ట్ర ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి ప్రసంగిస్తూ ప్రకాశంగారు ఫిర్కా అభివృద్ధి కార్యక్రమాన్ని తొలిసారిగా ప్రారంభించారని, స్వాతంత్రోద్యమంలో కొండంత ధైర్యంతో ముందంజవేసి, ఇతరులకు ప్రేరణ కలిగించారని ప్రశంసించారు. సమాచార శాఖ మంత్రి శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి ప్రకాశం జీవిత విశేషాల తెలిపే ఛాయాచిత్ర ప్రదర్శనను ప్రారంభించారు. రాష్ట్రప్రభుత్వ మాజీ ప్రధాన కార్యదర్శి శ్రీ టి. పుల్లారెడ్డి [ఐ. సి. ఎస్.] శ్రీ క్రొవ్విడి లింగరాజు, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ప్రకాశంగారితో తమకున్న సన్నిహితత్వాన్ని తెల్పుతూ ఆయన జీవిత విశేషాలు వివరించారు. సభ శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి శ్లోక పఠనంతో ప్రారంభమయింది. ప్రకాశం ఇన్‌స్టిట్యూట్ గౌరవ కార్యదర్శి డాక్టర్ టి. ఎన్. నారాయణరావు స్వాగతం చెప్పారు, ఫోటో ప్రదర్శనంలో సైమన్ కమీషన్ ముందు ప్రకాశంగారు గుండుకు గుండె ఒడ్డి నిలిచిన చిత్రం విశేషంగా చూపరులను ఆకర్షించింది. దీనిని సుప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ ఏ. వి. రహీమ్ రచించారు.

ఉపశ్రుతి :

మీరు సెంచరీ కొట్టాలి. ఇక 28 ఏళ్లేగదా! అన్నాను సుప్రసిద్ధ సంస్కృతరచయిత పెరుమాళ్ల గుండాచార్యులతో, సెంచరీ కొట్టడం వాక్యాఘష్టమే, కాని వయస్సుతోపాటు గ్రంథ రచనలోను కొట్టాలని నా ఆశయం అన్నారు— సవినయంగా ఆయన. ఆయన సంస్కృత రచనలు 47.



త్వరలో

# రాగలహరి

సీరియల్



# తలలో ముడుచుకున్నట్టే
# మీ శరీరాన్ని అలంకరించుకోడానికి
# రంగు రంగుల పువ్వుల గుత్తులు...

మీ శరీరాన్ని పువ్వులతో అలంకరించుకొనేందుకు ఆకర్షణీయంగా అందాలుచిందే ఇంపైన పువ్వుల విన్యాసంతో క్రొత్తరకం మెట్టూర్ ప్రింటులను ప్రవేశ పెడుతున్నారు.

కని విని ఎరుగని అప్పుడే వికసించిన మనోహరమైన పువ్వులవర్ణ విలాసము పసుపుపచ్చని చామంతులు. పరవశపరచే చంపకాలు. సొగసుగా వికసించిన ఎఱ్ఱ గులాబీలు కంటికి ఇంపైన వంగపుఛాయ పువ్వులు. నకాంబరాలు, కాశీరత్నాలు ఇంకా ఎన్నెన్నో....

ప్రత్యేకంగా తయారైన మెట్టూర్ ప్రింటులు అలాగే ఉపయోగించవచ్చు లేకపోతే సూపర్ ఫైన్ మెట్టూర్ పాప్లిన్‌లతో జోడించి వాడుకోవచ్చు.

అంతేగాకుండా అలరించే మెట్టూర్ ప్రింటులు మరియు మెట్టూర్ పాప్లినులు ఎంతో మన్నికైనవి.... రంగు చెడనివి మా క్రొత్త క్రొత్త రకాలు ఒక్కసారి వచ్చి చూడండి.

## మెట్టూర్ ప్రింటులు, పాప్లిన్‌లు



మీరు అభిమానించే
మెట్టూర్ మల్లులు, లాంగ్‌క్లాత్
తయారుచేసేవారే వీటిని తయారుచేస్తున్నారు.



OBM 6352 TG

# నాకీ తాళి వద్దు

నెల్లుట్ల వేంకటేశ్వరరావు



బాజాలు మోగుతొంటే, భవాని గుండెల్లో రైళ్ళు పరుగెత్తుతున్నాయి. మంత్రాలు వల్లిస్తూంటే వింటూ, పురోహితుడి మాట ప్రకారం తంతు చేస్తోంది. మాంగల్యధారణం మధురమైన ఘట్టం మగువజీవితంలో. కాని, పెళ్ళిపీటల మీద కూర్చొని, తంతుచేస్తున్న భవానికి మాత్రం, మంగళసూత్ర మంటే మనస్సు విలవిలలాడి పోతున్నది.

గతం కళ్ళల్లో కదులుతున్నది. బాధగా వుంది భవానికి, అది తల్చుకుంటేనే. చిన్న వయసులో చిదంబరంలో జరిగిన ఘోరాన్ని గుర్తు చేసుకుంటేనే గడగడా వణకి పోతోంది మనసు.

'అమ్మా, తలెత్తు' అన్నాడు పురోహితుడు. చటుక్కున తలెత్తింది భవాని. తెలియకుండానే చూసింది సుందర్రావును.

బుగ్గన చుక్క, చంద్రునిలో మచ్చలా వుంది. నల్లని నొక్కుల జుట్టు. జుట్టులో అక్షతలు, నక్షత్రాల్లా వున్నాయి.

"ఎంత అందగాడు"! పెళ్ళిచూపుల కొచ్చినప్పుడు సూట్‌లో చూసింది. కాని, యిప్పుడు "ఈ పసుపు బట్టల్లో మరీ అందంగా వున్నాడు" అనుకుంది తలవంచుకుని భవాని.

పెళ్ళిపందిట్లో జనం హాయిగా నవ్వుతున్నారు. పెద్దలూ, పిన్నలూ, అత్తరూ, పన్నీరు, తాంబూలాలందుకుంటున్నారు.

'ఇలా వుండాలి అదృష్టమంటే! కాసు కట్నం యివ్వకుండా, అందమైన, అమెరికా చూసిన అల్లుణ్ణి పట్టాడు పరంధామయ్య! దేనికైనా పెట్టిపుట్టా లన్నారు" అని చుట్టాలు కబుర్లాడుతున్నారు.

"అమ్మాయికన్నా, అబ్బాయే వన్నె ఎక్కువ! అందునా, అబ్బాయిది తెలుపుకాదు, పసిడివన్నె" అని మూలగా కూర్చున్న ముత్తైదువలు గుసగుసలాడుతున్నారు.

హోలెగిరిపోయేలా, మేళం మ్రోగింది. అందరి చూపులూ వధూవరుల మీదే నిలచాయి. మంత్రం మొదలయ్యింది. 'మాంగల్యధారణం...' అని అందుకున్నాడు పురోహితుడు. భవాని స్నేహితురాళ్ళు, భవాని జడను పైకెత్తారు. పురోహితుడు మంగళసూత్రాన్ని, పెళ్ళికొడుకు సుందర్రావు చేతి కందించాడు.

సుందర్రావు లేచాడు.

భవాని చారెడేసి కళ్ళతో భయం భయంగా మాంగల్యాన్ని చూసింది. గుండె దడదడలాడింది. ఒళ్ళు వణకిపోయింది. మధురమైన దృశ్యాన్ని చెదరగొడుతున్నది ఏదో చెప్పలేని భయం.

సుందర్రావు చేతుల్లో నూలు. పసుపులో ముంచిన నూలు. మధ్యలో మంగళసూత్రాలు.

భవాని గుండెలో అణచలేని బాధ, అయిష్టత. మాటరాని పరిస్థితి.

"కానీయ్, నాయనా!" అన్నాడు పురోహితుడు. సుందర్రావు భవాని మెడను తాకాడు. భవాని, విస్ఫారిత, విశాలనేత్రాలను చూశాడు. ఆ కళ్ళలో ఆనందం కనిపించలేదాతనికి. అంతుతెలియని ఆవేదన, పలుకలేని వెలికిరాని వేదనల లోతులు కనిపించాయి. క్షణకాలం, అలాగే భవాని కళ్ళల్లోకి చూశాడు సుందర్రావు. భవాని మనసులోని భయాన్ని కళ్ళు దాచకుండా చూపుతున్నాయి.

భవాని కళ్ళు దించుకుంది.

సుందర్రావు మనసులో ఆలోచనలు ముసురుకున్నాయి.

"కానీయ్, నాయనా" అన్నాడు మరోసారి పురోహితుడు.

సుందర్రావు భవాని మెడలో మూడు ముళ్ళు వేశాడు. మౌనంగా కూర్చున్నాడు. మొహంలో ఆనందం లేదు.

కట్టిన మంగళ సూత్రాన్ని తాకలేదు భవాని, సర్దుకోలేదు. తలవొంచి చూస్తున్నది వాటినే. భవాని తల్లి సర్దింది. స్నేహితురాళ్ళు గిలిగింతలు పెట్టారు. నవ్వురాలేదు భవానికి.

భవాని విచారంగా వుంది.

మనసు దాచినా, కళ్ళు వివరిస్తున్నాయి తన భయాన్ని, బాధను.

పెళ్లి ముగిసింది.

వెళ్ళేవాళ్ళు వెళ్ళిపోయారు. మిగతావాళ్ళు కబుర్లతో సరదాగా వున్నారు.

సుందర్రావు మనసులో అనుమానాల జడివాన, ఆలోచనల తుఫాను.

"భవాని బాధేమిటి ?"

"ఆమె కిష్టంలేదు తాళి." అది అతను గ్రహించాడు.

"ఇష్టం లేనప్పుడు పెళ్లికెందు కొప్పుకుంది?"

"తనతో విదేశాలకు రావాలనిఅడిగినప్పుడు పెళ్లి చూపుల రోజున, సంతోషంగానే వస్తానని ఎలాఅంది?"

మరి మంగళసూత్రం కట్టే సమయాన అగ్ని పర్వతాన్ని ఆలింగనం చేసుకోబోతు న్నట్టు బాధపడం దెందుకో?

ఎవరినైనా--

ఇదివరకే ప్రేమించిందా !

ఇది-- ఈ పెళ్లి, అమ్మా నాన్నల బలవంతమా ? ఎందుకలా మారింది భవాని, పెళ్లి పీటలమీద, మూడు ముళ్ళు వేసే ముహూర్తాన ???

ఎన్నెన్నో ప్రశ్నలు, సుందర్రావు మనసును సూదుల్లా గుచ్చుతున్నాయి.

ఇప్పుడేం చేయాలి తను!?

తాళి కట్టేశాడు, పెళ్లి జరిగిపోయింది? ఐనా మనసులు కలవనప్పుడు, మంగళ సూత్రానికి, పలికిన మంత్రాలకు విలువే ముంది?

# నా కీ తాళి వద్దు

ఆలోచనలతో బుర్ర వేడెక్కి పోతోంది. పెళ్లి చేసుకుని, భార్యతో హాయిగా తిరిగి అమెరికా వెళ్లి, కాపురం చేస్తూ కాలక్షేపం చేయాలని వచ్చిన సుందర్రావు మనసులో ఆలోచనల సుడిగుండాలు సుళ్ళు తిరిగాయి.

ఆనందం ఆరిపోయింది.

అనుమానాల చీకటి చిక్కగా పేరుకుంది అతని మనసులో.

రాత్రి —

దాదాపు పదిమిదైంది —

భోజనాలు ముగించుకున్నారు, మిత్రులూ తాను.

రమ్మని పిలుపు —

వెళ్ళాడు. మళ్లీ, ఏవో మంత్రాలు, ఆ తర్వాత దంపతులకు దానాలు, కానుకలిప్పించారు, భవానితో తనతో — ఈ తంతు త్వరగానే ముగిసింది.

గదిలో తనను వదలి అందరూ వెళ్ళారు.

'ఓహో! శోభనం !' అనుకున్నాడుతనలో.

'ఏమిటిది ? ఎందుకిలా జరిగింది ?' అని పూలమంటపంలా అలంకరించిన, పందిరి మంచంపైన కూర్చున్నాడు. భవాని వచ్చింది.

మనిషికన్నా, మల్లెపూల బరువే ఎక్కువగా వుంది. గది తలుపులు మూసింది,గడియ వేసింది భవాని. అగరొత్తుల పొగ తీగలతో నిండిన గదిలో, మల్లెపూల మధుర మనోహర పరిమళాలహరులు నిండాయి. మెల్లగానడచింది భవాని.

కొంగు సవరించుకోబోతే ఘల్లుమన్నాయి భవాని చేతి గాజులు.

తలెత్తి చూశాడు సుందర్రావు.

తల దించుకుని, మంచానికి దూరంగా నిల్చుంది భవాని.

'భవానీ' అన్నాడు సుందర్రావు.

భవాని తలెత్తింది.

కాటుక నిండిన కళ్ళు, ఖంజరీటల్లా వున్నాయి. పల్చని తెల్లచీర కొంగుచాటున పసుపుతాడు, బంగారు మాంగల్యాలు మెరుస్తున్నాయి.

చూశాడు సుందర్రావు పరీక్షగా.

'ఇలా..రా...కూర్చో'అన్నాడుసుందర్రావు, మంచం అంచు చూపిస్తూ.

భవాని సిగ్గుగా, నడుస్తూ వచ్చి,మంచం అంచున కూర్చుంది.

సుందర్రావు లేచాడు.

భవాని ఆశ్చర్యంగా చూసింది.

సుందర్రావు చూపులు మరో చోట వున్నాయి.

"నీకీ... పెళ్లి... యిష్టం లేదా?" అన్నాడు.

చటుక్కునలేచి, తలెత్తి విస్తుపోతూ చూసింది భవాని. భవాని చూపులను అల్లుకున్నాయి సుందర్రావు చూపులు. నవ్వింది భవాని.

నవ్వి... "చాలా యిష్టం" అంది.

సుందర్రావు మనసు కాస్త తేలికపడింది. అనుమానాల మంచు తెరలు కరగిపోయాయి.

"నేను తెచ్చిన రవ్వల గాజులు, పచ్చల దండ, చంద్రహారం వేసుకోలేదేం?" అన్నాడు సుందర్రావు కాస్త దగ్గరగావస్తూ. అతని మాటల్లో కొంచెం అనుమానం తొంగి చూసింది. తలెత్తి దీనంగా చూసింది భవాని.

"ఇష్టం లేదా?" అన్నాడు.

మాట రాలేదు భవానికి.

"నచ్చలేదా?" అన్నాడు.

చెప్పలేక పోయింది. కళ్లల్లో నీళ్ళు మెల్లగా చేరుతున్నాయి.

"తాళి కట్టేముందు నిన్ను చూశాను, పెళ్లి పీటలమీద— తాళిని చాలా ప్రేమగా కాక, చాలా కోపంగా, భయంగా చూశావు. ఎందుకు?" చాలా సున్నితంగా అడిగాడు సుందర్రావు.

భవాని కళ్ళు పూర్తిగా నీళ్లతోనిండాయి. లైటు వెలుగులో మిలమిలా మెరుస్తున్నాయి, కళ్ళు, నీళ్ళు. మాట రాలేదు భవానికి.

"భవానిగారూ!" అన్నాడు.



# తెల్ల జుట్టు
# జుట్టుకు వేసే
# రంగుల గురించి మీకున్న
# మూఢ నమ్మకాలన్నిటినీ
# తేలికగా కొట్టివేస్తున్నది
# గోద్రెజ్

**జుట్టు తెల్లబడడం సహజం**

అవును, నిశ్చయంగా. కాని తెల్ల జుట్టును అలాగే వదిలేయడం మాత్రం అసహజం. ఎందుకంటే, గోద్రెజ్ వారు జుట్టుకు రంగు వేసుకోవడాన్ని షాంపూ చేసుకోవడమంత సహజంగా, అంతే సులభంగా రూపొందించారు.

**తెల్ల జుట్టు ఉంటే 'కొట్టవచ్చినట్టుగా' కన్పిస్తుంది!**

తెల్ల జుట్టు 'కొట్టవచ్చినట్టుగా' కన్పించడమే కాదు, అందువల్ల మీరు ఏళ్లు పైబడినట్టుగా కూడా కన్పిస్తారు. కావలిస్తే మీ స్నేహితుల్ని అడగండి.

**ఎవరంత కష్టపడి జుట్టుకు రంగు వేసుకుంటారు?**

ఎవ్వరూ చెయ్యరు. అందుకే గోద్రెజ్ వారు తనంతట తానే వ్యాపించే హేర్ డైని మీకందిస్తున్నారు. ఎంతో శ్రమపడి జుట్టును విడదీసి రంగు వేసుకోనక్కర్లేదు. మీరు చెయ్యవలసిందల్లా ఈ హేర్ డైని జుట్టుకు పట్టించి నురుగు వచ్చేలా రుద్దడమే. కాస్సేపు ఆగి తరవాత దాన్ని కడిగి వేయాలి. ఎంతో సులభం కదూ!

**రంగు వేసుకోవడం వల్ల జుట్టుకు హాని కలగదా?**

కొన్ని పాత రకం హేర్ డైల వల్ల తప్పకుండా హాని కలగవచ్చు. అందుకే గోద్రెజ్ హేర్ డై ప్రత్యేకంగా రూపొందించబడింది. దీనిలోని 'హేర్ కండిషనర్' వల్ల మీ జుట్టు ఆరోగ్యంగా నిగనిగలాడుతూ ఉంటుంది.

భారతదేశపు మొట్టమొదటి తనంతట తానే వ్యాపించే హేర్ డై!




## గోద్రెజ్

పర్మనెంట్ హేర్ డై

—జుట్టుకు రంగు వేసుకోవడంలో 'శ్రమ' లేకుండా చేస్తుంది. అంచేత, దీనితో మీరు మీ వయస్సును తగ్గించుకోవచ్చు.

రెండు సైజుల్లో లభిస్తుంది: 20 మి.లీ. మరియు 40 మి.లీ.

పురుషుల కోసం మరియు స్త్రీల కోసం 2 రంగుల్లో: సహజమైన నలుపు గాఢమైన గోధుమ రంగు.

ASGS-134-244 Tel

ఆ మాట వినగానే, భవాని గొంతునిండా శోకం గూడు కట్టింది.

"మీరేమీ బాధ పడకండి భవానిగారూ! చదువూ సంస్కారం వున్నవాణ్ణి. మీ మనసు గాయపరచను. మిమ్మల్ని నిరాశపరచను. మీకు తాళంటే యిష్టంలేదని గుర్తించాను. కాని... అప్పుడు చేయలేక పోయాను. ఇప్పుడూ మించిపోలేదు... ఇష్టం లేకుంటే చెప్పండి మాంగల్యం మనసులను కలపలేదు, మనుషులను బంధించలేదు. చెప్పండి... మీ రెవరినైనా ప్రేమించారా... మరొకరికి మన సిచ్చారా" చాలా హుందాగా, తలవంచుకుని అడిగాడు సుందర్రావు.

తెల్లచీర కొంగును ఉండగా చుట్టి నోటి కడ్డంగా పెట్టుకుని, వెక్కి వెక్కి ఏడ్చింది భవాని.

పందిరిమంచం కర్రను ఆసరా పట్టుకుని నిల్చుంది.

'నేను మీ భర్తను కాదు... మనసు తెలిసిన మంచి మిత్రుణ్ణని, మీ బాధ చెప్పండి.. తప్పక మీకు సాయం చేస్తాను. మాటతప్పను. ప్రమాణం చేస్తున్నాను.' "ఏమండీ!" అంది భవాని, ఎక్కిళ్లను ఆపుకుని, చెక్కిళ్ల మీద నుండి ప్రవహిస్తున్న కన్నీళ్లను తుడుచుకుంటూ. సుందర్రావు మనసు విలవిలలాడింది.

జాలిగా చూశాడు.

"మీరు నా భర్త. ఇదిగో యిటు చూడండి" అంటూ సిగ్గును తొలగదోసి, కొంగును పక్కకు విదల్చి, బ్లౌజు ముందుగ బిగించిన 'హుక్సు'ను తొలగించి చూపింది.

కళ్లు చెదిరాయి సుందర్రావుకు.

"ఏమిటది? ఎలా అయ్యింది ?? ఏమిటా బొబ్బలు? ఎందుకలా కందినట్టు, కాలినట్టు" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఇందుకేనండి నా భయం! తాళి అన్నా నాకిదేభయం! ఈ భయం వల్లనే తాళిని చూసి విల విల లాడాను" అంటూ బ్లౌజును లాక్కొని, కొంగు కప్పుకుంది.

"ఏమిటది అన్నాడు" సుందర్రావు.

"నాకు బంగారం ఎలర్జీ" అంది భవాని.

"గోల్డు ఎలర్జీనా ? చాలా వింతగా వుందే! ఎప్పుడూ వినలేదు, చూడలేదు ? పూలూ, పుప్పొడి ఎలర్జీల వంటివే కాని... ఇది...వినలేదే" విస్తుపోయాడు.

"అవునండీ! నా రాత అలా వుంది ? ఎవరికీలేని జబ్బు!? ఎవరికీ రాని జబ్బు

# నాకీ తాళి వద్దు

కూడానేమో ? అందుకేనండీ, యింతవరకు, నేను ఏ నగలూ పెట్టుకోలేదు, బంగారాన్ని ముట్టుకోలేదండీ! చిన్నవయసులో, నాన్నగారు చిదంబరంలో పని చేస్తున్నప్పుడు, తొలిసారి బంగారు గొలుసు వేశారు మెడలో— అంతే— తెల్లవారేవరకు వొళ్లంతా యిలాగే బొబ్బలు— అందుకే మీరు అన్ని నగలు తెచ్చినా ..." వెక్కి వెక్కి ఏడ్చింది భవాని.

సుందర్రావు జాలిగా చూశాడు.

"ఏ నగా వేసుకోకుండా యిన్నేళ్లు బ్రతికాను, కాని... యీ నా ప్రాణం — మీరు కట్టిన తాళి... తప్పదు... నేనేమైనా చింత లేదు, ఇది నా ప్రాణం" అని తాళిని తీసి కళ్లకద్దుకుంది. వెక్కి వెక్కి ఏడ్చింది.

"భవానీ! ప్లీజ్! వద్దు! ఇంకేడ్వొద్దు!!" అంటూ భవానిని వొళ్లోకి తీసుకుని ఓదార్చాడు సుందర్రావు.



ఆ స్పర్శ సుఖానికి భవాని నర నరం క్రొత్త స్వరాన్ని పలికింది. ఆనందంతో సుందర్రావు వొళ్లో వాలింది.

"భవానీ!" అని ప్రేమగా, తల నిమురుతూ పిల్చాడు సుందర్రావు.

"ఊ !" ఊహాలోకంలో మంచి మాట్లాడింది భవాని.

"ఇలా చూడు... మనసులు కలిశాక మంగళసూత్రాలెందుకు, మంత్రాలెందుకు?" అంటూ మాంగల్యాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు.

"ఇది తప్పదండీ! వేరే దేశంలోనో, వేరే జాతిలోనో, వేరే కులంలోనో పుడితే బాగుండేది... ఇక్కడ ఇది తప్పదు నాకు" అంటూ అతని చేతుల్లోని తాళిని తీసుకుని మరోసారి కళ్లకద్దుకుంది భవాని.

"వద్దు భవానీ ! నీకీ యమయాతన వద్దు! మాంగల్య ధారణం ఒకసాంప్రదాయం. చట్టం కాదు. అమెరికాలో మాంగల్యంలేదు, మన దేశంలో అందరికీ ఈ పద్ధతి లేదు. అందుకే... ఇది లేకున్నా..."

"ఏమండీ...!" అని జాలిగా చూసింది భవాని.

"ఏమీ కాదు...ప్యాస్‌పోర్టు కోసం పెళ్లి సర్టిఫికేట్ అవసరం. మన మాంగల్యం కాదు వాళ్లకు రుజువు. సర్టిఫికేట్ ... అది తీసుకుందాం చాలు..." అంటూ సుందర్రావు, తాను వేసిన మూడు ముళ్లను తానే విప్పేశాడు.

భవాని కేమీ తోచలేదు.

వద్దంటే వినలేదు... పెద్దలకు... అమ్మకూ నాన్నకూ తెల్పు తన అవస్థ. తాళిని విప్పి, బెడ్‌లైట్ పక్కన, బల్లమీద పెట్టాడు.

జాలిగా, దీనంగా చూసింది భవాని.

జాలీగా నవ్వాడు సుందర్రావు. లైటార్పి, బెడ్‌లైట్ వేశాడు.

"మల్లెపూల మత్తు మనసును నిలవకుండా చేస్తుంది భవానీ" అంటూ అమాంతంగా ఎత్తుకొనివెళ్లి పందిరిమంచంలో పడుకోబెట్టాడు.

భవాని మనసున కోరికలు నిద్రలేచాయ్.

కొంగు పక్కకు లాగాడు సుందర్రావు. లాగి... "బంగారం ... పొడు బంగారం ... భవానీ ... ఎలా చేసింది, యీ మెత్తని, ఎర్రని వొంటిని..." అంటూ బుజ్జగిస్తూ, బులిపిస్తూ ముద్దులతో ముంచాడు.

"ఏమండీ!" అంది అతికష్టంమీద పెదాలకు విరామం దొరికితే.

"ఏమిటీ!" మత్తుగా అన్నాడు.

"పసుపు కొమ్మైనా కట్టుకుంటే..." అంది భవాని.

"సరే ! అన్నీ యిక్కడే ! అమెరికాలో ఎవరూ అడగరు ... ఐనా అక్కడ డాక్టర్లకు చూపిస్తాను... బాగైతే— నా భవానికి బంగారు తొడుగే చేయించనూ..." చివరి మాట విని భవాని చిలిపిగా సుందర్రావు బుగ్గను గిల్లింది...

"అబ్బా!" అంటూ అల్లుకుపోయాడు సుందర్రావు.

భవానీ సుందర్రావుల శృంగార లీలల చూస్తూ మురిసింది బల్లమీది తాళి.

# అన్నిటికన్నా తక్కువ ధరకు
# అన్నిటికన్నా ఎక్కువ శుభ్రత




ఇతర అన్ని డిటర్జెంట్ బార్లకంటే ఎంతో ఎక్కువ ఉత్తమమైనది, ఎంతో ఎక్కువ ఆదానిచ్చేది మరియు సబ్బులకంటే 1½ రెట్లు ఎక్కువ శక్తివంతమైనది

## నీలి రంగు స్వస్తిక్ డిటర్జెంట్ ఉతుకే బార్

ఒక మారు స్వస్తిక్ బార్...మరి ఎప్పటికీ స్వస్తిక్ బార్

Shilpi DM 9 A/80 Tel

VTS/P/84

# ఫాలాక్షుని డైరీ

## తృతీయ స్థానం!

పుస్తక ప్రచురణలో ప్రపంచ దేశాలలో మన భారత దేశానికి పదో స్థానమట. కానీ ఇంగ్లీషు పుస్తకాలు ప్రచురించడంలో మన దేశం బ్రిటను, అమెరికాల తరువాతి మూడో స్థానం సంపాదించుకున్నదట. ఏటికి మన దేశం మూడు కోట్ల రూపాయల కిమ్మతు గల పుస్తకాలు ఎగుమతి చేస్తున్నదట. దేశం ఏవేవో చేస్తోంది సార్.

## అసలు కారణం!

జపాను దేశంలో ఏ రాజశాసనం చేసినా ఆ శాసనం మీద రక్తంతో రాజుగారి కుడిచేతి ముద్ర మొత్తం వేస్తారట. దీనికి ఎవరి రక్తమయినా సరే తీసుకు వచ్చి పెడ్తారట. ఈ అలవాటు ఆ దేశంలో సుమారు అయిదొందల ఏళ్లుగా వస్తోందట. దీని క్కారణమేమని ఆలోచిస్తే ఏ యింకులకన్నా, రంగుల కన్నా రక్తంతో వేసిన ముద్ర చాలా ఎక్కువ కాలం పోకుండా వుంటుందట.

## శరీరమంతా పచ్చబొట్లు!

బ్రిటనుకు చెందిన 35 ఏళ్ల బిరియాన్ నోవల్ అనే ఆయన జిమ్మీ గుప్త్ అనే అతని సహాయంతో నఖశిఖ పర్యంతం పచ్చ బొట్టు ఒళ్లంతా పొడిపించుకున్నాడట. శరీరంలో ఏ భాగాన్నీ వదలకుండా మొత్తం శరీరం నిండా పచ్చ బొట్టు పొడిపించేసుకుని తన వాంఛనెరవేరిందని వో ప్రకటన చేశాడట. ఇతనికి పచ్చ బొట్టు పొడిచిన జిమ్మీ ఆ బిరియాన్ చచ్చిపోయాక ఆయన శరీరాన్ని తనకు యివ్వాలని పత్రం రాయించుకుని దానిగ్గాను ఆయనకు ఐదు వేల పౌనులు పారితోషికం ఇచ్చాడట. బిరియాన్ చనిపోయాక అతని శరీరాన్ని మ్యూజియంలో పెట్టి ప్రదర్శిస్తాను అన్నాడట జిమ్మీ. ఇంతకూ ఆ బిరియాన్ జిమ్మీకన్నా ముందే చనిపోవాలని ఏమీ ఎగ్రిమెంటు లేదు కదా!

## అంధులపై పోలీసుల దౌర్జన్యం!

ఢిల్లీలో అఖిలభారత అంధు లందరూ తమ కోర్కెల పత్రాన్ని ప్రధానికి సమర్పించడానికి వూరేగింపుగా బయలుదేరి జంతర్‌మంతర్ జయ్‌సింగ్ రోడ్డు వరకూ వచ్చేసరికి కొంతమంది పోలీసులు వారికి ఎదురొచ్చి వారు నిర్ణయించుకున్న మార్గం ప్రకారం వూరేగింపు వెళ్ల వీల్లేదని, మరో రోడ్డు గుండా పోవాలనీ అన్నారట. దానికి అఖిల భారత అంధుల సమాఖ్య ఫెడరేషన్ తాత్కాల సెక్రెటరీ సంతోష్‌కుమార్ ఒప్పక, తాము పది రోజుల ముందే పోలీసులకు తాము పోయే మార్గం వివరిస్తూ దరఖాస్తు పెట్టుకున్నామనీ, దానికే పేధమైన అభ్యంతరము పోలీసు తెలుపలేదనీ, తమకు బందోబస్తు కూడా యిచ్చారనీ చెప్పారట. దానికి పోలీసులు "అదంతా మాకు తెలీదు. మీరిటు వెళ్ల రాదు" అని అంటే, సంతోష్‌కుమార్, ఇది అన్యాయం. మేం ఇటే వెళ్తాం. కావాలంటే మమ్మల్ని అరెస్టు చేయండి. అని ప్రదర్శకులను ప్రోత్సహించారట. దాంతో పోలీసులు గప్పున లాటీలు తీసుకుని చకచక చేతికందిన వారిని ఉతికి వేశారట. ఆ ప్రదేశమంతా రక్తపు మరకలూ, కళ్లజోళ్ల ముక్కలతో నిండిపోయిందట. చావబాది, వారినందరినీ వ్యానుల్లో ఎక్కించుకుని, తీహార్ జైల్లో పడేసి, మళ్లీ చితకబాది ఆనక వదిలేశారట. ఈ విషయం కళ్లారా చూసిన వో ఢిల్లీ పత్రికా విలేఖరి ఆ ప్రాంతానికిబాధ్యుడయిన పోలీసుకమీషనర్ బ్రార్‌కు ఫోను చేస్తే, అన్నీ అబద్ధాలనీ పోలీసులు చెయ్యి ఎత్తలేదని అన్నారట. దానికా విలేఖరి తాను ఆ దృశ్యం కళ్లారా చూశానని చెప్తే "సరి ఇహనేం. చూస్తే మీ యిష్టంవచ్చినట్టు రాసుకోండి. నన్నెందుకు అడగడం" అని చెప్పి ఫోను టక్కున పెట్టేశారట. అయ్యో! పోలీసులకు చేజిక్కినవారిని చితక బాదడంలో ఉండే హాయి మరే పనిలోనూ ఉండదనుకోవాలి సుమీ!

## తిరుపతి హుండీలో 5 లక్షలు!

ఆగస్టు ఏడో తేదీన తిరుపతి పరాత్పరుని హుండీ లెక్కలు చూస్తున్న వారు వో పసుపు గుడ్డ మూట విప్పి ఆశ్చర్యంతో కొయ్యబారిపోయారట. అందులో 4731 వంద రూపాయల నోటూ 578 యాభై రూపాయల నోట్లూ ఉన్నాయ ఇవన్నీ వెరసి అయిదు లక్షలపై చిలుకుట. ఇ వరకూ స్వామివారి హుండీలో ఒకే భక్తుడీ డబ్బు వెయ్యలేదట.

## హనుమంతునిలో ఐక్యమైన వానరం!

ఇండోరుకు 15 కిలోమీటర్ల దూరంలో ఉన్న హంస్పేలా అనే వూరిలోని హనుమంతని గుడికి వో కోతి వెళ్లి విగ్రహం ముందు కూర్చుని రెండు చేతులూ జోడిస్తూ నమస్కరించి, అదే పోజులో చనిపోయిందట. ఈ అద్భుతాన్ని చూడ్డానికి వేలాది ప్రజలు ఆ వూరు వెళ్లారట. ఆ కోతికి హిందూ సాంప్రదాయ ప్రకారం దహన సంస్కారాలు చేసి, ఆనక ఆ వూరు వారు సంతర్పణ కూడా చేశారట.

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar. Vijayawada-3. Editor: S. Radhakrishna**